# దక్షిణ భారత దేవాలయములు



రచన :

''సాహిత్యభూషణ''

వసంతరావు రామకృష్ణరావు

ఎం.ఏ. (ఇంగ్లీషు), ఎం.ఏ. (తెలుగు), విశాఖపట్టణము.



ప్రముఖ క్రికెటర్ శ్రీ కపిల్‌దేవ్‌తో
ముచ్చటిస్తున్న ప్రముఖ రచయిత
శ్రీ రామకృష్ణరావు



పార్లమెంటు సభ్యులు
శ్రీ టి. సుబ్బిరామరెడ్డిగారు
శ్రీ రామకృష్ణరావుకు జ్ఞాపిక బహూకరణ



ప్రముఖ రచయిత
శ్రీ వసంతరావు రామకృష్ణరావు, భార్య శ్రీమతి కామేశ్వరీబాయితో



కరీంనగర్‌లో బోయినపల్
వేంకటరామారావుగారు
శ్రీ రామకృష్ణరావును సత్కరిస్తున్
తేది 2-10-1980



శ్రీ రాఘవేంద్ర స్వామి బృందావనం ట్రస్టు
చైర్మన్ శ్రీ సి.యు.వి. కృష్ణమూర్తిగారిని
శ్రీ రామకృష్ణరావు సత్కరిస్తున్న సన్నివేశం
తేది 4-6-2001



ప్రముఖ నవలారచయిత శ్రీ ఘం
బ్రహ్మాజీరావు ఉగాదినాడు వి
పోర్టుట్రస్టు ''సాగరి'' సభల
శ్రీ రామకృష్ణరావుకు మొమెం
బహూకరణ తేది 25-3-20



ఆవిష్కార సభలో శ్రీ రామకృష్ణరావు
రచనా వ్యాసంగమును అభినందించుచు
ప్రసంగిస్తున్న 'ప్రసన్న భారతి' పత్రిక
సంపాదకులు, కవిశేఖర శ్రీ కొండేపూడి
సుబ్బారావుగారు, చిత్రంలో
డా॥ గణపతిరాజు అచ్యుతరామరాజు,
డా॥ బి. సన్యాసిరాజు గార్లు,
శ్రీరామకృష్ణరావుగారు ఉన్నారు.

# దక్షిణ భారత దేవాలయములు




కృతిపతి :

"కవిశేఖర"

**శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు**

విశాఖపట్టణము.


రచన :

"సాహిత్యభూషణ"

**వసంతరావు రామకృష్ణరావు**

ఎం.ఏ. (ఇంగ్లీషు), ఎం.ఏ. (తెలుగు), విశాఖపట్టణము.

మొదటి ముద్రణ : సెప్టెంబరు 2001
ప్రతులు : 1000





వెల : రూ॥ 30/-

ప్రతులకు :

వసంతరావు రామకృష్ణరావు
H.No. 45-50-14
అబిదునగర్,
విశాఖపట్టణం - 16.



ప్రచురణ :

శ్రీ భారతీ తీర్థ
విశాఖపట్టణం - 16.

ముద్రణ :

రియల్‌టైమ్ కంప్యూటర్ సర్వీసెస్
29-42-18, SBI కోలనీ,
జడ్జికోర్ట్ ఎదురుగా, విశాఖపట్టణం - 530 020
ఫోన్ : 0891-565270

# పెద్దల దీవెనలు : ప్రముఖుల అభిప్రాయాలు : ఉత్తరాలు

చిరంజీవి రామకృష్ణరావు, సాహిత్యమే తన ప్రపంచం అనుకొంటున్న అమాయకుడు. మంచి కవి, ఆస్తికుడు – ఈ మధ్య విశాఖపోర్టు ట్రస్టు యాజమాన్యం వీరిని గౌరవించడం ముదావహమైన విషయం!

*శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీగారు,*
గుంటూరు, తేది 2-4-2001

---

గేయ కవిరాజు, కవిమిత్ర, కవిరత్న, మధురకవి కోకిల, సాహిత్యభూషణ, పరిశోధన శిరోమణి, ప్రాక్ప్రతీచీ సాహిత్య సంస్కృతుల రుచిర సమ్మేళన మూర్తి, అప్పుడైన, పూర్వ విద్యార్థి చి॥ వసంతరావు రామకృష్ణరావుకు 76వ జన్మదిన శుభసందర్భముగా ఆశీః పూర్వకముగా నా గ్రంథము ''అవతారతత్త్వ వివేచన''ను బహూకరించుచున్నాను.

*ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు,*
సికింద్రాబాదు.

---

మీకు జరిగిన, జరుగుతున్న పురస్కారాలకు సత్కారాలకు నా హృదయ పూర్వక అభినందనలు – మున్ముందు మీకు మరెన్నో సత్కారాలు జరుగవలెనని నేను సదా భగవంతుని ప్రార్థించుచున్నాను.

*డా॥ కూటికుప్పల సూర్యారావుగారు*
Senior Physician, Ministry of Health and Family Welfare
Govt. of India D/31-08-01

---

మహోదయులు శ్రీ రామకృష్ణరావుగారికి,

నేను వాడుకగా మిమ్ములను పొగడుట లేదు. విశాఖలోని గాజువాక సిటీకేబుల్‌వారు మిమ్ములను ఘనముగా సత్కరించుట నాకు సంతోషము కలిగించినది. అంతకన్న గొప్పఅర్హత మీకున్నది! ఆంధ్రాంగ్ల భాషలు రెండింటిలోను రచనచేయు ప్రతిభ మీకున్నది. నా అభినందనలు తెలియజేయుచున్నాను.

*ఖూర్గుల రంగనాథరావుగారు*
*Retd. Dy. Secretary : A.P. Govt.*
[illegible] : తే 17-8-01

---

రామకృష్ణరావుగారికి,

నమస్తే!, మీ 76వ జన్మదిన ఉత్సవం జరగడం ముదావహం – మీ సారస్వత కృషి ప్రశంసనీయం – ఈ వయసులో కూడా మీ చైతన్య స్ఫూర్తి అందరికీ ఆదర్శం కావాలని నా ఆకాంక్ష – మీకు నా హృదయ పూర్వకమైన శుభాకాంక్షలు

కళాప్రపూర్ణ *డా॥ పోతుకూచి సాంబశివరావు*
ఎడిటర్: 'విశ్వ సాహితి', సికింద్రాబాదు, తే 24-2-01

---

సాహిత్య భూషణులు
శ్రీరామకృష్ణరావుగారికి,

మీ 76వ జన్మదిన ఉత్సవం సందర్భంగా ప్రత్యేక సంచిక వెలువరించుచున్నందులకు నా అభినందనలు – అభివాదములు – మున్ముందు మీరు ఇంకను మరికొన్ని జన్మదిన ఉత్సవాలు జరుపుకోవాలని ఆకాంక్షించుచున్నాను.

గాత్రం శ్రీరాములు, కవి.
రిటైర్డ్ హెడ్‌మాస్టర్, పోతవరం, గుంటూరు, తే 22-2-01

---

పూజ్యనీయులైన నాన్నగారికి,

నమస్కారములు, మీకు ఈ రోజుకి కూడా, పోర్టు అధికారులు, ఉద్యోగులు, కార్మికులు, ఆదరించి అభిమానము చూపుట, మిక్కిలి ప్రశంసనీయమైన విషయము – ఉద్యోగ రీత్యా, పనుల వత్తిడి వలన మీ జన్మదిన వేడుకలలో, వేమిద్దరము పాల్గొనలేక పోవుచున్నాము. మన్నింపవలెను – అమ్మకి, మీకు మా దంపతుల ప్రణామములు

వి.ఎస్. వేంకటరావు, ML
A.G.M. (LAW), IFCI Ltd.



**Kothapalli Veerabhadra Rao,** M.A., Ph.D.
16, Siva Rama Krisna Colony,
West Marredpally Main Road,
Secunderabad - 500 026.
Tel : 7800670

- శ్రీః పాతు -

## చి॥ వసంతరావు రామకృష్ణరావు 75వ జన్మదినోత్సవ శుభసందర్భంలో ఆశీః పూర్వకామోదవీచికలు

వినయ భూషితుడును విజ్ఞుడును గనుక
పేరునందు నింటిపేరునందు
రెండురావులను ధరించెనితడుగాని
తేల్చిచూడరానిదేదిలేదు !

ముట్టినట్టిదెల్ల ముత్యమైనతనరారు
పట్టినట్టిదెల్ల పసిడియగును
రామకృష్ణరావు రచనలన్నియు గూడ
రసిక హృదయ రాగరంజకములు !

కొత్తపల్లి వీరభద్రరావు



గేయకవిరాజు, కవిమిత్ర,
కవిరత్న, కవిభూషణ,
మధుర కవికోకిల, సాహిత్యభూషణ
చి॥ వసంతరావు రామకృష్ణరావు
విశాఖపట్టణము

# విషయసూచిక



ఈ కావ్యమును

వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు, సహృదయులు,
'కవిభూషణ', 'కవిశేఖర', 'మధురకవి', 'అభినవపోతన',
'భారతీ ప్రసన్న', ఇత్యాది సద్బిరుదాంచితులు, 'ప్రసన్న భారతి',
'సాహిత్యపత్రిక వ్యవస్థాపక సంపాదకులు', 'శతాధిక గ్రంథకర్త'

**శ్రీ కొండేపూడి సుబ్బారావుగారికి**

గౌరవ పూర్వక నమస్కృతులతో అంకితమిచ్చుచున్నాను.

**వసంతరావు రామకృష్ణారావు**
గ్రంథకర్త

9-2001
విశాఖపట్టణము

# అవతారిక

శ్రీ రమారమ్యవిలసితమై, విశేషమగుదైవీ సంపత్తి కల, మన విశాల భారత దేశ చరిత్ర చాలా ప్రాచీనమైనది. ఆ విధముగనే అనాది నుండియు సనాతన ధర్మానుష్ఠాన ప్రధానమగు జీవన విధానముతో భారతదేశ విశిష్టమగునట్టి అర్ష సంప్రదాయము కలిగి, విలక్షణమగు సాంస్కృతిక, నైతిక, ఆధ్యాత్మిక చరిత్రలో విశ్రుతమైనది !

మన దేశమును ఆ సేతుశీతాచలము విస్తరించిన వివిధ రాష్ట్రములలో, వేరువేరు కాలములలో వెలసిన పలు దేవాలయములు కలవు. అవి యన్నియును సచేతనమగు శిల్ప సంపదతో నలరారుచు, భక్తిభావమునకు తావలముగా నుండుటయే కాక, ముముక్షువులకు, సాధుపుంగవులకు, యోగులకు, అత్యంతము అరాధ్యమైయున్నవి!

ఒక మహనీయుని ప్రేరణ కారణముగా నేను పదునెనిమిదేండ్ల క్రితము, విశాఖపట్టణమునందును, అపరిసరములందును గల, కొన్ని ఆలయముల వివరములను సేకరించి ఎంతగనో శ్రమించి బంధుమిత్రుల సహకారముతో, తిరుపతి తిరుమల దేవస్థానము వారు అందచేసిన ధన సహాయముతో ''విశాఖ పట్టణ దేవాలయములు'' అను ఒక పరిశోధన గ్రంథమును రచించి, ప్రచురించి, నన్ను ప్రోత్సహించిన మాన్యశ్రీ దేశికాచారి శేషాద్రిగారికి 1989లో విశాఖలో గల శ్రీ రాఘవేంద్రస్వామి వారి దేవాలయ ప్రాంగణములో అంకితము చేసితిని. ఈ గ్రంథము నాపురాకృత సుకృత ఫలితముగా సామాన్యులనే కాక, విద్వద్వర్యులను, ఆచార్యులను, విద్వాంసులను అమితముగా నాకర్షించినది !

మరల, ఇంతకాలమునకు మరియొక గ్రంథము వ్రాయవలెనను తలంపు నాకు కలిగినది - దీని విషయమై నన్ను ప్రోత్సహించిన ''శ్రీ భారతీ తీర్థ'' ప్రధాన కార్యదర్శులు, ప్రముఖ న్యాయవాదులు, నాకు బంధుగులు మరియు ఆత్మీయులునైన శ్రీ కాంద్రేగుల సూర్యనారాయణమూర్తిగారికి, ముందుగా నా కృతజ్ఞతా నమస్కృతులనందచేయుచున్నాను.

సుమారు 6,7 యేండ్ల నుండియు నేను, తరచుగా కేరళ రాష్ట్రమును సందర్శించు అవకాశము లేర్పడినవి. సహజముగా ఆలయ చరిత్రము, ఐతిహ్యము, స్థల పురాణములు - వీనియందు నాకు గల ఆసక్తిని పురస్కరించుకొని, కేరళ రాష్ట్ర రాజధాని నగరమైన తిరువనంతపురమునందును పరిసర ప్రదేశములందును గల కొన్ని ఆలయములను గూర్చి నా యెూపిన కొలది, ఒక గ్రంథమును వ్రాయుటకు సంకల్పించితిని.

కేరళ రాష్ట్రమునకు ప్రాచీన చరిత్ర కలదు. 7,8 శతాబ్దులకు పూర్వమే ఈ మండలములో పండింపబడిన లవంగములు, ఏలకులు మొదలైన సుగంధ ద్రవ్యములు పశ్చిమ సముద్రమైన అరేబియా సముద్రమునుండి, విదేశములకు ఎగుమతి

యగుచుండెను. ఇంకను ప్రాచీనమైన విషయమేమనగా విష్ణ్వంశ సంభూతుడు అగు పరశురాముడు సముద్రములో నున్న ప్రస్తుత కేరళ భూభాగమును తన గండ్ర గొడ్డలితో, వెలికి తీసెనని ప్రతీతి కలదు. అదేవిధముగా కొంకణ దేశమును కూడా పరశురాముడే సముద్రము నుండి సంపాదించినట్లుగా గాథ కలదు.

చారిత్రికముగా ''తిరువాన్కూర్-కొచ్చిన్'' మండలము కూడా ప్రసిద్ధి వహించినది. 1498లో వాస్కోడిగామా తొలిసారిగా సముద్రతీరము మీదుగా కేరళ చేరినట్లును, తరువాత ఈ మండలము విదేశములతో వర్తక వాణిజ్యములు సాగించినట్లును విశదమగుచున్నది.

ఆ కాలములో మనదేశములో గల రాజుల నడుమగల వైరము కారణముగా కేవలము వ్యాపారము కొరకు వచ్చిన విదేశీయులు తమ తమ ప్రాబల్యముతో ఇచట స్థిరపడి తమ ఆధిపత్యమును, ప్రభుత్వ పాలనమును నెలకొల్పుటకై ప్రయత్నించిరి. ఈ విధమైన వ్యాపార ప్రాబల్యము కొరకు పోర్చుగీసువారు, డచ్చివారు, ఫ్రెంచివారు మరియు ఆంగ్లేయులు పరస్పరము పోటీలు పడిన విషయము విదితమైనదే!

ఇచట చారిత్రిక హంశముల గురించి కొంత తెలిసికొనుటకై వ్రాసితిని. కాని నా రచన యొక్క ముఖ్యమైన ఉద్దేశ్యము దక్షిణ భారతదేశములలో గల కొన్ని ఆలయములను గూర్చి వ్రాయుట – కనుక, ఎప్పటివలెనే సహృదయులగు పాఠకులు నన్ను ప్రోత్సహింప ప్రార్థించుచున్నాను.

గడచిన దశాబ్ద కాలములో నారెండవ కుమారుడైన చిరంజీవి సత్య వేంకటరావు తిరువనంతపురము, బెంగుళూరు నగరములలో ఉద్యోగిగా ఉన్న కాలమున, మా దంపతులకు కొన్ని దేవాలయములను సందర్శించుటకు సహాయ పడెను. కోడలు చి॥ ల॥ సౌ॥ రమణి కూడా సహకరించినందున విషయములను, వివరములను సేకరింప వీలుపడినది. ఈ సందర్భముగా వారిద్దరికి నా దీవెనలను అందచేయుచున్నాను.

అదేవిధముగా ఆలయములకు సంబంధించిన ఐతిహ్యములను, స్థల పురాణములను, ఛాయా చిత్రములను నా కోరికమేరకు అందజేసిన ఆయా దేవాలయ అధికారులకు నేను కృతజ్ఞుడనని మనవి చేయుచున్నాను.

ఈ నా గ్రంథమును కృతిభర్తగా దయతో స్వీకరించిన కవిశేఖర కొండేపూడి సుబ్బారావుగారికి నా కృతజ్ఞతానమస్కృతులు. చక్కగా ముద్రణ చేసి, సకాలములో అందచేసిన "Realtime Computer Services" వారికి నా అభినందనలు.

ముద్రణకు ఆర్థిక సహాయమునందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికి నా కృతజ్ఞతాభివందనములు.

అబిదునగర్ — విధేయుడు

విశాఖపట్టణం – 16 — **వసంతరావు రామకృష్ణరావు**

# శ్రీ సుబ్రహ్మణ్యస్వామి వారి ఆలయము

## (ఎస్. వి. టి. ఆసుపత్రి ఎదురు వీధి, తిరువనంతపురము, కేరళ)

మన భారత దేశమున, పడమటి కనుమలకును, అరేబియా సముద్రమునకును, నడుమగల భూమండలము కేరళ రాష్ట్రము – అది దక్షిణ ప్రాంతమున కలదు – ఇచట జనసాంద్రత అధికము – మరియు, రాష్ట్రము నూటికి, నూరు శాతము అక్షరాస్యత సాధించి, అగ్రగామిగా ఉన్నది. విశేషమేమనగా, ఇచట ప్రకృతి మిక్కిలి ఆహ్లాదకరమై, సంవత్సరములో అధిక భాగము, పర్యాటకులకు అనందదాయకమగు వాతావరణముతో ఉండును.

త్రివేంద్రము అను పేరుగల తిరువనంతపురము, కేరళ రాష్ట్ర రాజధాని నగరము – ఎత్తు పల్లములు గల వీధులతోడను, సందులతోను ఉన్నప్పటికిని, ఈ నగరము పరిశుభ్రమైన పరిసరములతో, దర్శనీయమై యున్నది.

ఈ నగరము నందు, ఇంచుమించుగా నడిబొడ్డున "పట్టము" అని పిలువబడు, విశాలమగు ప్రాంతము కలదు. ఇచట, వైద్యాలయము, ప్రభుత్వ, ప్రభుత్వేతర కార్యాలయములు, విద్యాలయములు, దుకాణములు కాఫీ–ఫలహారశాలలు, ఎత్తయిన విశాలమైన భవనములు కలవు. భవన ప్రాంగణములలోనున్న, కొబ్బరి, అరటి, పోక, మొదలగు చెట్లు తమ హరిత పత్రములతోను, ఫలములతోను, పలురకముల పుష్పజాతులతోను, చూపరులకు పాదచారులకు, అత్యంతము, రమణీయముగా గోచరించి, ఆహ్లాదము కలిగించు చుండును. ఇది అనుభవైకవేద్యమైన దృశ్యము!

మిక్కిలి దట్టమైన జనసంచారము కదలికలతోను, పలు వాహనముల రాకపోకలతోను, సందడిగా నుండు ఈ ప్రాంతములో, రోడ్డుకి ఒక వైపున మనకు శ్రీ సుబ్రహ్మణ్యస్వామివారి ఆలయము కనుపించును. ఒక సన్నని మార్గము, ఆలయ ముఖద్వారమునకు దారితీయగా, అంతగా ఆకర్షణీయముగా కనుపించని శ్రీ సుబ్రహ్మణ్యస్వామి వారి దేవాలయములోనికి, మనము ప్రవేశింపగలము.

చారిత్రికముగను, భౌగోళికముగను, వాణిజ్యపరముగను, సాంస్కృతికముగను, సామాజికముగను, రేవు పట్టణమైన కొచ్చిన్ (Kochin), జనసంఖ్యలోను, వైశాల్యములోను, రాజధాని తిరువనంతపురముకన్న,

ఎక్కువగా నుండుట విశేషము !

స్థానికులు నాకు తెలిపిన ప్రకారము, ఈ ఆలయము నూరేండ్ల క్రితము వెలసినది! మనము ఆలయములోనికి ప్రవేశింపగనే, ఎదురుగా శ్రీ సుబ్రహ్మణ్యస్వామి విగ్రహము దర్శనీయమై ఉన్నది – దీనికి అభిముఖముగా, ప్రత్యేకముగా నిర్మితమైన, నెమలి (రాతి) విగ్రహము కలదు. కుడిపార్శ్వమున, ఒక పెద్ద అశ్వత్థవృక్షమున్నది. ఈ వృక్షము ఒక విశాలమైన రాతి చప్టాపై, చాలయెత్తుగా పెరిగి, కొమ్మలతో, రెమ్మలతో నుండి, భక్తులు ప్రదక్షిణము చేయుటకు, వీలుగా నున్నది. ఈ వృక్షమూలమున, దిగువ భాగమున, శ్రీ నాగదేవుని (నాగరాజన్) విగ్రహము, చిన్నది, సర్పాకారములోనున్నది.

ఈ చిన్నగుడి ఆగ్నేయ దిశలో, శ్రీ వినాయకుని మందిరము (ఆయతనము)ను, నైఋతి దిక్కునందు, కేరళవారికేగాక, యావద్భారత దేశ వాసులకు, ఆరాధ్య దైవమైన శ్రీ స్వామి అయ్యప్ప మందిరమును కలవు.

ఈ ఆలయములోనే, అర్చకునకు, ఒక నివాస గృహము కలదు. ప్రతి నిత్యము, ఉదయము, సాయంత్రము, భక్తులు, ఈ గుడి దైవతములను సందర్శించి, ప్రార్థనాదికములు చేయుచున్నారు. మలయాళీల ఆచారము ప్రకారము, ప్రత్యేక దినములలో, ఇచట ధూపదీపారాధనలు, అర్చనలు, నివేదనము, నీరాజనాదులు జరుగుచున్నవి. అందులో, తైపూజ, వైశాఖపూజ, నాగరాజార్చనము, గణపతి ఆరాధన ప్రధానమైనవి – ప్రతి శనివారమును, శాస్త్ర పూజ జరుగును. భక్తజనమందారుడైన శ్రీ అయ్యప్పస్వామికి నీరాజనమిత్తురు. అట్లే, షష్టిపూజ జరుగును.

కేరళలో, అతి ముఖ్యమైన పర్వదినము, ''ఓనమ్'' సందర్భముగా, ఈ ఆలయములో, వివిధములగు పూజాదికములు, భక్తిశ్రద్ధలతో, నివేదనములు జరుగుచున్నవి. ప్రముఖ ఆధ్యాత్మిక వేత్తలు, దైవభక్తులు, ఆయా సందర్భములలో తమ ఉపన్యాసములను, అందచేయుచు ప్రజలలో ఆస్తిక భావమును, దైవభక్తిని పెంపొందింప చేయుటయు దావహము. ముఖ్యముగా 80 యేండ్ల నుండి ఇచట ఉన్న, రావిచెట్టు, భక్తులకు ప్రధానమైనది. దీనికి ప్రదక్షిణములు చేసి, దైవములకు, దక్షిణలు, కానుకలు ఇచ్చి భక్తులు తరించుచున్నారు.

# శ్రీ పరశురామ దేవాలయము

## (తిరువనంతపురముదరి, కేరళ)

ఒకనాడు, సముద్రమునందున్న కొంతభూభాగమును, తన గండ్రగొడ్డలితో వెలికి తీసినందున, కొంకణ దేశము, మరియు కేరళ మండలము, వెలసెనని వినుచున్నాము! అందుచేతనే కాబోలు, కేరళ రాష్ట్ర రాజధానియైన, తిరువనంతపురములో, విశాలమైన ప్రదేశములో, ఆకర్షణీయమైన పరిసరములతో, శ్రీ పరశురాముని దేవాలయము వెలసినది!

నేను బస చేసిన, 'పట్టం' అనబడు ప్రాంతమునకు సుమారు 11 కిలోమీటర్ల దూరములో, అనగా, తిరువనంతపురము శివార్లలో, ఈ ఆలయము కలదు. నగరము యొక్క నడిరోడ్డు నుండి పోవునపుడు, కొంతదూరము వరకును, ఇరువైపులందు, దుకాణములు, కాఫీ ఫలహారశాలలు, చాలా సందడిగా జనసాంద్రతతో దర్శనీయమై పిదప, మరికొంత దూరము పోవగా, రెండువైపులా, మార్గము పొడుగునా, కొబ్బరిచెట్లు, అరటిబోదెలు, రమణీయమై, సహజమైన, ఆహ్లాదకరమైన, వాతావరణము, మరింతగా ఆహ్లాదమిచ్చును. ఈ విధమైన సందర్శనము అనుభవైకవేద్యము -

ఆరోడ్డునకు, దిగువభాగమున శ్రీ పరశురామునిగుడి ఉన్నది. ఈ ఆలయ ముఖద్వారము, విశాలమై ఉన్నది - ప్రవేశమార్గమునందు, ద్వారమునకు, రెండువైపులందు, స్త్రీల రాతి విగ్రహములు కలవు - అవి భక్తులకు సాదరమైన, స్వాగతము తెలుపుచుండును. మీది భాగమున, తెల్లని రాతి విగ్రహము, భక్తుల ఆస్తికుల, దృష్టిని ఆకర్షించును - అదియే పరశురాముని, నిలువెత్తు విగ్రహము - తలపై దట్టమైన కబరీ భరము, కుడిచేతియందు స్పష్టముగా కనుపించి, కనువిందు చేయు గండ్రగొడ్డలి, చూడవచ్చును. ఆ విగ్రహము దర్శించునపుడు, విష్ణ్వంశసంభూతుడైన పరశురాముడు (ఆరవ అవతారము) ఇరువది యొక్కమారులు, క్షాత్ర సంహారము చేసి, భూభారమును తగ్గించిన, భీకర సన్నివేశము, భక్తుల మనసున మెదలును!

ఈ విగ్రహము గల, ముఖద్వారమును (ఆర్చిని), తిరువానూర్కరు దేవస్థానము బోర్డు అధ్యక్షులైన శ్రీ ఎన్. భాస్కరన్‌నాయర్‌గారు, శ్రీమతి

సరస్వతీ కుంజాకృష్ణన్, శ్రీహరి హరయ్యర్ల అధ్వర్యమును 7-9-1988 తేదీన ఆవిష్కరింపబడినది. ఈ విషయము, నల్లని రాతి ఫలకముపై చెక్కబడి యున్నది.

ద్వారము దాటి, ఆలయము యొక్క గర్భగుడిలోనికి ప్రవేశింపగా, ఎదురుగా, ఎత్తయిన ధ్వజస్తంభము, దర్శనమిచ్చును. ఆలయ నిర్మాణమందు, ధ్వజస్తంభమునకు గల ప్రాముఖ్యమును గూర్చి, వాస్తుశాస్త్రమునందు చెప్పబడిన శ్లోకము ఈ విధముగానున్నది :-

''శిఖరంశిరః, గర్భం కంఠః
హృదయం చాంతరాళం
కుక్షిస్థానంతు మంటపం
ప్రాకారం జాను జంఘం
గోపురం పాదయుగ్మం
ధ్వజంతు జీవస్థానం'' -

అనగా, దేహమే దేవాలయమని దీని భావము. ధ్వజస్తంభ నిర్మాణము, స్థాపనము, మొదలగునవియన్నియు ఆగమమున, నిర్దేశింపబడిన రీతిలో నుండవలెను - ప్రత్యేక ఉత్సవములందు, పూజాదికములు, ఇక్కడనే జరుగుచుండును !

ఈ ఆలయము గర్భగుడి (Sanctum Sanctorum) కి, కుడివైపున చిన్న పుష్కరిణి కలదు. అచటనే గల ఒక చిత్రము (పటము) నందు గల పరశురాముని కుడిచేతిలో గండ్ర గొడ్డలి, ఎడమచేతిలో బాణము కలవు.

ధ్వజస్తంభమునకు వామభాగమునందు, వేదవ్యాస మందిరమున్నది. అట్లే, అచట పరశుశివన్ దైవమునకు చిన్నమందిరము కలదు - దానిముందు భాగమున, ఒక రాతి చప్టాపై నంది విగ్రహము, 5 పడగలు గల సర్ప విగ్రహము, మరియు వినాయకుని యొక్క విగ్రహమును, భక్తులనాకర్షించుచుండును ! ఈ ప్రాంగణమంతయు విశాలమై ఉన్నది - నలుదిశలందును, ప్రాకారము వంటిది కలదు - ఇచట బ్రహ్మ దేవునకును ఒక మందిరమున్నది. ఆలయము మధ్యనుండగా నాలుగువైపులందును వసారా గలదు.

ఇచట, ఒక ప్రత్యేకమైన పూజామందిరములో అర్చకులు, సాముదాయికముగా భక్తుల కొరకు, వారి కోరికపై, పూజాదికములు, ధూపదీప

నివేదనములు, చేయుచున్నారు. ప్రసాదవితరణమును జరుగుచున్నది.

మలయాళీల ఆచార ప్రకారము వచ్చు, ప్రత్యేక ఉత్సవములు, పండుగలు – వీని సందర్భమున ఈ ఆలయమున విశేష పూజలు జరుపబడును. ఆలయములోపలి భాగమున, ఒకవైపున బావి కలదు.

ముఖ్యముగా, ముందుగా పేర్కొనదగిన శ్రీ మహాగణపతి మందిరము ఒకటి, సువిశాలమైన, ఈ ఆలయ ప్రాంగణమున కలదు. గణములకు అధిపతిగ విఘ్నములను తొలగించు విఘ్ననాయకునిగ, గణపతిని గురించి విశేషమగు ప్రస్తావన, పురాణములందునను, వేదములందును కలదు – "గణానాంత్వాగణపతింగ్ హవామహే" అనుటను బట్టి వినాయకుడు గణనాథుడు – శ్రీ మహాగణపతి! భారతీయులందరికిని గణపతి ఆరాధ్య దైవము – విఘ్నేశ్వర పూజ, బాధలను పోగొట్టును, ముక్తిని చేకూర్చును.

ఈ దేవాలయ ప్రాంగణములో, ముందుభాగమున ఒక పెద్ద రావిచెట్టు కలదు – ఆ వృక్షమూలమున, భక్తులు ఆరాధించుకొరకు, విగ్రహములు కలవు. మరియు దేవతారాధనములో, ప్రధానదైవతమగు నాగరాజా విగ్రహము కలదు. మానవ జీవన విధానములో, వివిధ రంగములలో వచ్చు మార్పులకు, కారకులైన వారిగా భావింపబడుచున్న నవగ్రహములు గల మందిరమున్నది.

దైవప్రార్థనమే కాక, నవగ్రహారాధనము కూడ అవసరమైనది, అను విషయము, మనము జరుపుకొను, కొన్ని వ్రతములలో (శ్రీ సత్యనారాయణ వ్రతము) ఉన్నది. గ్రహస్థితి బాగుండని వారు, కొన్ని కష్టనష్టములకు, ఆందోళనకు అలజడికి లోనగువారు, ఆయా గ్రహములకు తగువిధముగా, శాంతి, జప, దాన, హోమములను చేయుటయే కాక, నవగ్రహప్రదక్షిణము చేయుట కూడా ఆచారము. ఆకారణముననే, కొంతమంది, నవగ్రహములకు శాంతిగా నవరత్నములను, ఉంగరములందు ధరించునాచారము, ఇప్పటికి మన దేశమున, వివిధ ప్రాంతములలో ఉన్నది.

# శ్రీ నవనీత కృష్ణ దేవాలయము

## (Thekke Gramam of PERINKULAM, కేరళ)

సర్వసాధారణంగా మనకు దక్షిణ భారతదేశంలో, ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో గల పల్లెలలో, పట్టణాలలో, నగరాలలో, అధికసంఖ్యలో శ్రీరామ మందిరములు కనుపించును. అట్లే, విష్ణు ఆలయములు, శివాలయములు, విఘ్నేశ్వరాలయములు, ఆంజనేయ మందిరములు మరియు పలునామములతో, అనుదినము ఆరాధింపబడు గ్రామ దేవతాలయములు వెలసి, వివిధ ప్రదేశములలో, ధూప, దీప, నివేదనాదులతో కళకళలాడుచు, ''అమ్మ'' గా అందరిచేతను పూజలనందు కొనుచున్నది.

'అమ్మ' ఆదిశక్తి ! ఆ పరాశక్తి మూలముననే, సమస్తలోకములు నిర్వహింపబడుచున్నవి. త్రిమూర్తులుగా, సృష్టి, స్థితి, సంహార కారకులుగా చెప్పబడుచున్న బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు కూడ, ఆదిశక్తియే, ఆయా కార్యనిర్వహణమునకు, వారికి తగిన శక్తియుక్తులను ప్రసాదించుచున్నది! అమ్మ, అనగా అంబకు, మూడు రూపనామములు కలవు. అవి

1. జ్ఞానాంబ 2. భ్రమరాంబ 3. మూకాంబ.

కాని శ్రీకృష్ణునికి ఆలయములు అంతగా ఆంధ్రలో లేవనవచ్చును, విశాఖనగరములో సీతమ్మధారలో ''గురువాయురప్పన్ గుడి'' ఉన్నది. తమిళనాడు, కేరళ రాష్ట్రములలో అధికసంఖ్యలో గణపతి దేవాలయములున్నవి. గురువాయూర్‌లోను ప్రసిద్ధమైన శ్రీ కృష్ణదేవాలయము, దేశము పలుప్రాంతముల నుండి భక్తులను ఆకర్షించి, పూజాదికములను పొందుచున్నది.

దక్షిణ రాష్ట్రాలలో ముఖ్యముగా ఆంధ్రప్రదేశ్‌లో చాలామంది తల్లిదండ్రులు, తమ పిల్లలకు, శ్రీరాముని పేరును, శ్రీకృష్ణుని పేరును పెట్టుకొనుట సర్వసాధారణమైన విషయము. మరియు సింహాచల దివ్యక్షేత్రమునకు అధినాథుడైన శ్రీ వరాహలక్ష్మీ నరసింహస్వామి వారి పేరును, 'అప్పన్న' అను దానిని, పెట్టుకొనుచున్నారు. ఆ పేర్లకు ముందు తమ ఇలువేలుపుల పేరును కాని, కులదేవతల పేరును కాని చేర్చుచుందురు.

శ్రీరామచంద్రుడు పితృవాక్యపరిపాలకుడును, సమర్థుడును,

సత్యసంధుడున్నైన రాజ్యపాలకునిగా పేరుపొంది "రామోవిగ్రహవాన్ ధర్మః", అని ప్రశస్తి పొందినవాడు - శ్రీకృష్ణుని విషయము ఇందులకు చాలావరకు భిన్నముగానున్నది అను విషయము విదితము.

ధర్మసంస్థాపనార్థము, అవతరించిన శ్రీకృష్ణ పరమాత్మ, జన్మించినది, కారా గృహములో, పెరిగి పెద్దవాడైనది వ్రేపల్లెలో. దేవకీ వసుదేవులు తల్లిదండ్రులు, కాగా యశోదానందుల వద్ద అతడు పెరుగుచు, బాల్యము నుండియు, దైవసంబంధమైన లీలలను చూపుచు, అందరిని ఆశ్చర్య పఱచుచుండెను. శ్రీ మద్భాగవతమునంధు శ్రీకృష్ణుని మహిమా విశేషములు, లీలా వినోదములు, దుష్ట సంహారము, శిష్టరక్షణము వర్ణింపబడినవి!

శ్రీకృష్ణుడు, వాసుదేవుడు, నందనందనుడు, దేవకీ తనయుడు, నవనీతచోరుడు, మొదలగు గాగల పలు నామములతో పేరు పొంది, కీర్తింపబడుచున్నాడు. బాల్యమునందు గొల్ల ఇండ్లలో గల వెన్నను దొంగిలించి, వినోదించినందున "నవనీత చోరుడు" అయినాడు! నా పర్యటనలో గురువాయూర్ దేవాలయ సందర్శనము చేసిన సందర్భమున "నవనీతచోర శ్రీకృష్ణ దేవాలయము"నకు సంబంధించిన కొన్ని వివరములు ఆధారముగా, ఆ ఆలయ విశిష్టతను పొందుపఱిచెదను.

పాలక్కాడు నుండి తిష్యూర్‌కు పోవు మార్గములో పాలక్కాడుకు సుమారు 25 కి॥ మీ॥ దూరములో పేరింకులమ్‌కి చెందిన 'తెక్కె' అను గ్రామము కలదు. అది ప్రాచీనమైనది! అచటనే "నవనీత శ్రీకృష్ణదేవళము" కలదు. తమిళనాడులోని, తంజావూరు జిల్లాకు చెందిన భక్తులు కొంతమంది, నాలుగు శతాబ్దముల క్రిందట, ఈ ఆలయమును నిర్మించినట్లు తెలియుచున్నది. విశేషమే మనగా, తమిళనాడు మరియు కేరళ రాష్ట్రముల పూజావిధానములు రెండును, మిళితములై, ఆయా రాష్ట్రాల ఆచార సంప్రదాయముల ప్రకారము, అర్చనాదికములు జరుగుచున్నవి! అంతేకాదు, తమిళ సంప్రదాయములో గల ఆగమ శాస్త్ర విధానమునకు పూర్తిగా నిబద్ధమై పూజలు జరుగుచున్నవి. ఈ ఆలయమున ప్రతిష్ఠితమైన శ్రీకృష్ణ విగ్రహము, పాలక్కాడు జిల్లాకు చెందిన, ప్రసిద్ధమైన "Varikkassery Mana" నుండి తెచ్చినట్లు స్థానికులు తెల్పుచున్నారు. ఇది Ottapalem కి దగ్గరలో నున్నది.

భూసంస్కరణల కారణముగా, ఆలయమునకు రావలసిన ఆదాయము రాలేదు - అయినను, గ్రామవాసులు అధైర్యము చెందక, తమ గ్రామదైవమగు ఆ శ్రీకృష్ణునికి చేయువలసిన పూజలు చేయుచున్నారు, ఉత్సవములు జరుగుచున్నవి. ఆధ్యాత్మికపరమైన ఉపన్యాసములు, కొన్ని సాంస్కృతిక కార్యక్రమములు జరుపబడుచున్నవి. ఇవి అన్నియు భారీఎత్తున నిర్వహింపబడుటను బట్టి ప్రజల భక్తి విశ్వాసములను గమనింపవచ్చును.

ఈ ఆలయములో, 12 యేండ్లకు ఒకసారి ''కుంభాభిషేకము'' జరుగును. కాని, ఇటీవల కొన్ని అనివార్య కారణముల వలన, 1970 తరువాత, అనగా 27 యేండ్ల తరువాత, కుంభాభిషేకము (జూన్ 97లో) జరిగినది. చెంగలిపురం శ్రీరామ దీక్షితర్‌గారి ఉపన్యాసముతో, కుంభాభిషేక మహోత్సవము ప్రారంభమైనది!

ప్రస్తుతము చెన్నై (మదరాసు) లో నివసించుచున్న, శ్రీ ఎస్.ఆర్. బాలకృష్ణన్ అధ్వర్యంలో గ్రామస్థులు సంఘటితమై దీనికి కావలసిన పైకమును, చందాలు, విరాళములు రూపమున సేకరించి, ఉత్సవమును జయప్రదముగా, కనులపండువుగా జరుపుకొనుచు స్వామివారికి తమ భక్తి ప్రపత్తులను వెల్లడించుకొనుట హర్షదాయకము!

అచట జరిగిన అభిషేక ఉత్సవ విశేషములను గూర్చి వివరించెదను :-

1997 జూన్ 9న ప్రారంభమైన కుంభాభిషేక కార్యక్రమము జూన్ 15తో ముగిసినది. శ్రీకృష్ణమందిరము నుండి, వేదపారాయణముతో, చాతుర్ గ్రామ ప్రదక్షిణముతో వైదిక (దైవ) కార్యక్రమములు ప్రారంభమైనవి. ఇది 12వ తేదీన జరుగగా, మరునాడు, వివిధ పూజాకార్యక్రమములతో పాటుగా, వేద పారాయణము, పంచగణాధివాసము, మొదలగునవి జరిగినవి. నాలుగవ రోజున (15) కుంభాభిషేకము జరిగెను. వైదికమత సంప్రదాయము ప్రకారము, అరణిని మథించి అగ్నిని, రగిలించి, హోమ గుండము నిర్వర్తించిరి!

తిరుపతి, విజయవాడ దేవస్థానముల నుండి వచ్చిన 40 మంది వేద పండితులు (పురోహితులు), నాలుగు వేదములకు ప్రాతినిధ్యము వహించి, ఈ దివ్యమహోత్సవమునందు పాల్గొనిరి! సేలం, నమ్మక్కల్, తిరుచిరావల్లి మరియు పాలక్కాడు ప్రదేశములనుండి 12మంది భట్టాచార్యులు కూడా ఇందులో

పాల్గొని, ఉత్సవమునకు ఒక ప్రత్యేకత కల్పించిరి !

మరియొక విశేషము కలదు – ఆ గ్రామస్థులు అందరును, జాతి, మత, కుల, వర్గ, వర్ణవిచక్షణతో నిమిత్తము లేకుండ, ఐక్యభావముతో, భక్తి ప్రధానముగా సాగిన ఒక పెద్ద ఊరేగింపులో పాల్గొని, తమ ఇష్ట దైవము మరియు గ్రామాధి దేవతయైన శ్రీకృష్ణునకు, నివేదన నీరాజనములర్పించి ఆనందించిరి !

పాలక్కాడ్‌కు చెందిన, శ్రీమాన్ శ్రీనివాస భట్టాచారియర్‌గారు, కుంభాభిషేక ఉత్సవమునకు నాయకత్వము వహించిరి.

ఆలయ దోష పరిహారము నిమిత్తము కొన్ని కార్యక్రమములు నిర్వహింపబడినవి – అట్టి వానిలో దేవప్రశ్నము, మండల పూజ, అన్నదానము పేర్కొనదగినవి. మరియు అధ్యాత్మిక పరమైన దృశ్య కార్యక్రమములు ప్రదర్శింపబడి, ఉత్సవమునకు శోభను చేకూర్చినవి. గ్రామస్థులే స్వశక్తితో, ధనమును సేకరించి, ఆలయమునకు కావలసిన మరమ్మత్తులను చేయించిరి. రెండు రథములను బాగుచేయించి, ఆలయ ప్రాంగణము నందుంచిరి !

బాగుగా అలంకరింపబడిన మూడు ఏనుగులు సాయంత్రమున ప్రతిరోజూను ఊరేగింపులో పాల్గొనుచుండెను. ప్రసిద్ధి పొందిన బ్యాండువాయిద్యకారులు (సన్నాయిమేళము వంటిది), ప్రత్యేక తాళవాద్య మృదంగములతో (పంచవాద్యము) ఈ మహోత్సవములో పాల్గొనిరి.

# శ్రీ జ్ఞాన సరస్వతీ దేవాలయము

## (బాసర : ఆంధ్రప్రదేశ్)

అనాది నుండి, సనాతన ధర్మ ప్రధానమైన భారతీయ జీవన విధానములో, దైవారాధనము, ఒకసాధనముగా మోక్షమునకు నిధానముగా నెలకొనియుండుట విదితమైన విషయము. మానవులకు లౌకిక, పారలౌకిక విషయములందు తగు విజ్ఞానము అలవడుటకు అభ్యాసమనునది ముఖ్యమైనది. విద్యవలన విజ్ఞానము పెంపొందుటయే కాక, మంచిచెడులను వివేచన చేయగలశక్తి కూడ కలుగును. అందువలన ప్రాచీన కాలమున బాలురు, గురువుల వద్ద గురుశుశ్రూష చేయుచు, విద్యా, విజ్ఞాన వికాసములను పొందినట్లు, మనకు తెలియుచున్నది.

విశేషమేమనగా, అవతార పురుషులైన శ్రీబలరామకృష్ణులును, శ్రీరామచంద్రుడును, క్రమముగా సాందీపని, వసిష్ఠుల యొద్ద విద్యలనభ్యసించిరి!

పౌరాణికముగా, సృష్టి, స్థితి, లయ కారకులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, భారతీయులకు ఆరాధ్య దైవములు. బ్రహ్మదేవునకు భార్యయగు శ్రీ సరస్వతీ దేవికి ఆలయమున్నది! శ్రీలక్ష్మికిని, శ్రీ పరమేశ్వరికిని, పలునామములతో మందిరములు, దేశములో, వివిధ ప్రాంతములందును కలవు. మరియు పార్వతీదేవిని, దుర్గ, కాళిక, చండిక, చాముండి, రాజేశ్వరీదేవి వంటి వివిధ నామములతో, విభిన్న రూపములతో, విలక్షణముగానుండు ఆయుధములతో, మన దేశమందు గల పలురాష్ట్రములలో ఆరాధింపబడుచున్న విషయము విదితమే కదా! శాక్తేయులు, ఆదిశక్తిని, పరాశక్తిని భక్తి ప్రపత్తులతో సేవించుట, ఆ విధమైన సేవనమే జీవన సాధనముగ మోక్షప్రాప్తికి గమ్యమని భావించుట జరుగుచున్నది.

విద్యాధి దేవతగా, మన గ్రంథములందు కీర్తింపబడిన శ్రీ సరస్వతీ దేవి ఆలయము ఆంధ్రప్రదేశ్‌లో గల బాసరలోనున్నది.

కవులు, గ్రంథ రచయితలు, తమ కావ్య రచన ప్రారంభమున ''విఘ్ననాయకుడు'' అగు వినాయకునితో పాటుగా, శ్రీ సరస్వతీ దేవిని స్తోత్రము చేయుట గమనింపదగినది. సంస్కృత కావ్యములందు శ్రీ వాణీ దేవ్యారాధనము కలదు. అదికాక, నాటక, రూపక, నృత్య ప్రదర్శనారంభములందును

శ్రీసరస్వతీదేవిని, సంస్తుతి చేయు ఆచారము కలదు.

హృదయాలను స్పందింపచేసి, భక్తి భావ స్ఫోరకముగా గల, దివ్యక్షేత్రాలు, ఆంధ్రప్రదేశ్‌లో చాలా కలవు. ఇవి ప్రసిద్ధి చెందిన, ప్రశస్తి పొందిన క్షేత్రాలు. తిరుమల, శ్రీశైలము, అమరావతి, అరసపల్లి (హర్షవల్లి), అన్నవరము, దక్షారామము, సింహాచలము, మంగళగిరి, యాదగిరి గుట్ట, ద్వారకా తిరుమల, విజయవాడ వంటి పుణ్య క్షేత్ర సందర్శనము ఆయా ఆలయములందు దైవములనారాధించుట ముక్తిప్రదము !

మనరాష్ట్రములోనే కాక, దక్షిణ భారతదేశమునందును, శ్రీ జ్ఞాన సరస్వతీ క్షేత్రము, ఒక పుణ్యక్షేత్రముగా ప్రశస్తి పొందినది. అరుదైన ఈ దేవాలయమునకు సంబంధించిన ఐతిహ్యము ఈవిధముగానున్నది.

మహర్షులైన శ్రీ వేదవ్యాసులవారు, కుమారాచలములో, దీక్షతో తపము చేసినపుడు, చదువులతల్లి ప్రత్యక్షమై, ప్రతిదినము, గౌతమీనదీ తీరమునుండి మూడు పిడికెళ్ల ఇసుక రేణువులను తెచ్చి, ఈ క్షేత్రములోని మూడు ప్రదేశములలో ఉంచినచో, తాను ''శక్తిత్రయము'' గా అవతరింపగలనని తెలిపెనట ! ఆ శక్తిత్రయమే, ఈ క్షేత్రమునందు శ్రీ మహాకాళి, శ్రీ మహాలక్ష్మి, శ్రీ మహా సరస్వతి అమ్మవార్లుగా ఆరాధింపబడుచున్నది. ఆ విధముగా ఏర్పడినదే, ఈ శ్రీజ్ఞానసరస్వతీ దివ్యక్షేత్రము ! వ్యాసుల వారి తపో దీక్షకారణముగా, వెలసిన ఈ దివ్యక్షేత్రము, వ్యాసపురిగా, వాసరగా, బాసరగా పేరుపొందినట్లు తెలియుచున్నది.

బాసర క్షేత్రమునకు మరి ఒక ప్రత్యేకత కలదు. ఈ దేవాలయమునకు, దగ్గరలో, తూర్పుదిశలోనున్న పాపహరిణి సరోవరములో దేవేంద్రుడు, సూర్యుడు, శంకరుడు, శ్రీ మహావిష్ణువు, విఘ్నేశ్వరుడు, శ్రీరాముడు, వాల్మీకి, వేదవ్యాసుడు – వీరు స్నానమాచరించినందు వలన ఈ ఎనిమిది తీర్థములు అష్ట తీర్థములుగా ప్రసిద్ధిగాంచినవి.

శ్రీ సరస్వతీదేవి, విద్యావిజ్ఞానములకు, లలిత కళలకు సంగీత, సాహిత్యములకు, అధిదేవత కావున, భారతీయ సంప్రదాయమునననుసరించి, బాలబాలికలకు, 5వ ఏడురాగానే, శాస్త్రోక్తముగ అక్షరాభ్యాసము చేయు ఆచారము ముఖ్యముగా మన ఆంధ్రరాష్ట్రమునందు కలదు. అయితే, ఈ

అక్షరాభ్యాస కార్యక్రమమును శ్రీ బాసర క్షేత్రములో జరిపించినచో, ''చదువుల తల్లి'' కటాక్షముతో, వారి విద్యాభ్యాసము, చుఱుకుగా, చక్కగా, సాగి, వారు ప్రయోజకులు కాగలరను ప్రగాఢ విశ్వాసము ప్రజలలో, భక్తులలో ఉన్నది.

కొన్ని చారిత్రిక ఆధారములననుసరించి, ఈ క్షేత్రమున నెలకొనియున్న శ్రీ జ్ఞానసరస్వతీ అమ్మవారు, వాల్మీకిని రామాయణ కర్తగాను, విఘ్నేశ్వరుని అగ్రపూజార్హుని గాను, ఆశీర్వదించినట్లు తెలియుచున్నది।

ఇంతటి చారిత్రిక, పౌరాణిక, ఐతిహ్య ప్రశస్తి కల ''బాసర'' క్షేత్రమును సందర్శించుట వలన అజ్ఞానము తొలగి, విజ్ఞానులగుటయే కాక, త్రిమూర్తుల భార్యలలో ఒక దేవతగా ఉన్న శ్రీ సరస్వతీ దేవి అనుగ్రహమున, మోక్షమును పొందగలరనుటలో అత్యుక్తి లేదు।

బాసర చేరుటకు, నిజామాబాద్ నుండి ప్రతి గంటకు ఒక బస్సు బయలుదేరుచుండును. రైలు సౌకర్యమును కలదు. బాసర రైల్వేస్టేషనుకూడా ఉన్నది. విమాన ప్రయాణము చేయువారు, హైదరాబాదులో దిగి, ఇతర ప్రయాణ సాధనములతో, ఈ క్షేత్రమును సందర్శింపవచ్చును. అయితే నివాస యోగ్యమగు లాడ్జీలు, బాసరలో అంతగా లేవు. నిజామాబాద్‌లో బస చేయవలసి ఉన్నది.

రాష్ట్ర ప్రభుత్వము, దీనిని పర్యాటక పుణ్యక్షేత్రముగా, ఇంకను అభివృద్ధి చేయగలరని ఆశింపనగును।

మన పూర్వకవులు, శ్రీ సరస్వతీదేవిని స్తోత్రము చేయు సందర్భములను గమనింపదగును.

శ్రీ మదాంధ్ర మహాభాగవతమునందు, సహజ కవియగు పోతనామాత్యుడు ప్రారంభమున ''పీఠిక'' శీర్షిక యందు, విష్ణు ప్రార్థనము చేసిన పిదప, ''ఇష్ట దేవతా ప్రార్థనము'' నందు, తొలుత శూలికి (శివునకు), తరువాత భారతీ సౌఖ్య విధాత యగు బ్రహ్మ దేవునకు వందనము చేసి, తరువాత, గణపతికి నమస్కరించును. ముఖ్యమైన విషయమేమనగా శ్రీ సరస్వతీ దేవికి, ఈ దిగువనీయబడిన పద్యములతో ప్రార్థించును.

క్షోణితలంబునన్ నుదురు, సోకగ మ్రొక్కినుతింతు, సైకత
శ్రోణికి జంచరీకచయ సుందరవేణికి, రక్షితామర
శ్రేణికి దోయ జాతభవచిత్తవశీకరణైకవాణికిన్
వాణికి నక్షదామశుక వారిజ పుస్తక రమ్యపాణికిన్

శారద నీరదేందు ఘనసారపటీరమరాళ మల్లికా
హారతుషారఫేన రజతాచల కాశఫణీశ కుందమం
దారసుధాపయోధిసిత తామర సామర వాహినీ, శుభా
కారతనొప్పు నిన్ను మదిగానగ నెన్నడు గల్గు భారతీ.

అంబనవాంబుజోజ్జ్వల కరాంబుజ శారద చంద్రచంద్రికా
డంబర చారుమూర్తి ప్రకటస్ఫుట భూషణ రత్న దీపికా
చుంబిత దిగ్విభాగ శ్రుతి సూక్తి వివిక్త నిజప్రభావ, భా
వాంబరవీధి విశ్రుత విహారిణి నన్గృపజూడు భారతీ!

మన దేశమున రెండు సరస్వతీ దేవి ఆలయములు కలవు. అందులో ఒకటి కాశ్మీర్‌లో నున్నది. రెండవది బాసరలో కలదు. ఒక ఐతిహ్యము ప్రకారము, వేదవ్యాసమహర్షి, గోదావరీ నదీతీరాన, తపోనిష్ఠలోనుండి, అవ్యక్తస్వరూపమున గల శ్రీసరస్వతీదేవిని సంస్తుతించెను, అప్పుడాదేవి తన విగ్రహమును ప్రతిష్ఠ చేయవలసినదిగా వ్యాసమహర్షిని కోరెను, వ్యాసులవారు స్నానమాచరించి, శ్రీ సరస్వతీదేవి విగ్రహమును ప్రతిష్ఠించెను. అవి మూడు స్థలములలో శ్రీ మహాసరస్వతి, శ్రీ మహాలక్ష్మి, శ్రీ మహాకాళిరూపములలో ఆవిర్భవించెను. అంతట శ్రీ సరస్వతీదేవి, తాను ఆ మూడు రూపములందును అంతర్లీనమై ఉండగలనని తెలుపగా, వ్యాసమహర్షి, ఆ వాగ్దేవిని, శ్రీ సరస్వతీదేవి రూపమున ఆరాధించిన కారణముగా ఆ మందిరము శ్రీ సరస్వతీదేవి ఆలయముగా ప్రశస్తి చెందినది!

# శ్రీ భగవతి దుర్గాదేవి కోవిల

## (పట్టం - జ్యోతినగర్, కేరళ)

తిరువనంతపురంలో ఎక్కువ జనసమ్మర్దమూ, వాహనాల రాకపోకల కోలాహలమూ గల ప్రాంతాలలో ''పట్టం'' అను ప్రాంతం ప్రధానమైనది. మిక్కిలి జనసంచారము గల ప్రదేశాలలో, కేరళలో, మనకు అడుగడుగునా కనిపించేవి, హిందువుల పూజా మందిరాలూ, కోవెలలూ, అమ్మవారి ఆలయాలూ మాత్రమే కాకుండా క్రైస్తవుల చర్చిలూ, మహమ్మదీయుల మసీదులూ ఉన్నవి.

పట్టం ప్రాంతంలోనే ఉన్న ''రవి రోడ్''నకు ఎదురుగా, ఎత్తుగా ఉండే సందుద్వారా వెళ్లేవారికి 100 గజాల దూరంలో ఒక చిన్న దేవీ మందిరము కనుపిస్తుంది. ఈ ఆలయం 'జ్యోతినగర్' (పట్టం ప్రాంతం)లో ఉన్నది. ఇచట ఒక కళాశాల విద్యార్థి అయిన, డా॥ వి. బాలాజీ అందజేసిన ఆలయ వివరాలను బట్టి ఈ కోవెలలో సుమారు 300 యేండ్ల క్రితము దుర్గాదేవి విగ్రహము ప్రతిష్ఠితమైనది ! అయితే, ఈ మధ్యనే అనగా 3,4 యేండ్ల క్రిందట ఈ దేవీమందిరము మరల అందముగా పునర్నిర్మితమై, శోభాయమానమై, ఇచటకు వచ్చునట్టి భక్తజనసందోహమునకు భక్తిని కల్పిస్తుంది !

నేను ఈ ఆలయమును సందర్శించితిని. గర్భగుడి చిన్నది. అందులో శ్రీ దుర్గామాత విగ్రహము కలదు. దుర్గ అనగా మనలను దుర్గతి ( దుస్థితి) నుండి తప్పించి రక్షించు, దయార్ద్రమైన భగవతీదేవి అని అర్థము. ఈ విగ్రహము కూడా చిన్నదే – అయినను, ఒక చేతిలో విల్లును, వేరొక చేతిలో కరవాలమును ధరించి, ఆదేవి ఆర్తులను ఆదుకొంటున్నది. అందువలననే ఆదిశక్తి రూపిణియైన ఆ పరాశక్తిని, మనము భక్తి ప్రపత్తులతో అనుదినము, సేవించి, జీవించి, జన్మసాఫల్యమును పొందవలెను. గర్భగుడికి అభిముఖముగా ఒక గచ్చు వసారా ఉన్నది. ఇచట భజనలు, కీర్తనలు జరుగుచుండును. దైవసంబంధమైన అధ్యాత్మ ప్రసంగములు కూడా వినవచ్చును.

ఈ వసారాను ఆనుకొని ఒక వైపున నాగదేవుని చిన్నమందిరమును, మరియొక తట్టున శ్రీమహాగణపతి గుడియును కలవు. శ్రీ దుర్గాదేవి ఆలయమును ప్రతిరోజూను ఉదయము, సాయంత్రములందు దీపారాధనము

జరుగును. పెద్దవీ, చిన్నవీ అయిన సెమ్మాలలో తైలము వేసి, దీపములు వెలిగించి అమ్మవారికి పూజలు చేయుదురు.

ఇచట జరిగే పూజావిధానంలో, ప్రత్యేకంగా పేర్కొనబడినది. ''ఐశ్వర్యపూజ'' అనునది. శ్రీదుర్గాదేవి అనుగ్రహము వలన, ఇహపరములు రెండింటియందును, మానవులు ఐశ్వర్యము పొంది ఆనందించి తరించుటకు ఈ పూజ ఉద్దిష్టమైనది.

ఈ ఆలయమున, నాలుగు విధములైన, ప్రధానమైన విగ్రహములు కలవు. అవి :-

1. బ్రహ్మరాక్షసి
2. యోగీశ్వరుడు
3. యక్షి (ణీ) దేవి
4. మదర్ తంపురార్, అనునవి.

మనదేశములో ఆరాధనా విధానములు ఒక్కొక్క ప్రాంతములో ఒక్కొక్క విధముగానున్నవి. కేరళలో గల చాలా ఆలయములలో, భక్తులకు ప్రసాదముగా చందనము, పసుపు, పుష్పములు, కుంకుమ వంటివి అందించెదరు.

ఈ ఆలయమున కూడ అదే పద్ధతి కలదు. ఈ ఆలయ పూజారి నివసించుటకు, ఆలయ ప్రాంగణంలోనే, ఒక గది నిర్మితమైనది.

పంచాంగము ప్రకారము, సంక్రమణము, ఏకాదశి, పౌర్ణమి అనునవి ఆలయ ప్రత్యేక పూజలకును, వ్రతములు, నోములు వంటివి జరుపుకొనుటకును, వినియుక్తమగుచుండును. ప్రతి పౌర్ణమి రోజున అనగా నెలకు ఒకపరి, తప్పనిసరిగా శ్రీ దుర్గాదేవికి ప్రత్యేకపూజాదికములు జరుగుచున్నవి.

# శ్రీ కపోతేశ్వర దేవాలయము

## (చేజెర్ల, ఆంధ్రప్రదేశ్)

గుంటూరు జిల్లాకు చెందిన, నకరికల్లు మండలములోగల, చేజెర్ల గ్రామంలో గల కపోతేశ్వర దేవాలయము ఐతిహాసికముగను, చారిత్రికముగను ప్రసిద్ధి పొందినది. క్రీ॥ శ॥ 3-4 శతాబ్దములకు చెందిన శివాలయముగ, ఇది ప్రశస్తి కలిగి ఉన్నప్పటికిని ఇచ్చట బౌద్ధ శిధిలములు కూడా కనుపడుచున్నవి।

పురావస్తు శాఖవారు, ఈ దేవాలయమును చరిత్ర ప్రసిద్ధి పొందిన, పురాతన ఆలయముగా నిర్ధారణ చేయుటయే కాక, 1958 చట్టము ప్రకారము జాతీయమైనదిగా ప్రకటన చేసిరి.

ఈ ఆలయము ప్రధాన ద్వారము గుండా, గర్భగుడిలోనికి పోవునపుడు, పురావస్తుశాఖవారు త్రవ్వి విడిచిన శిధిలములు కనుపించును. ఈ త్రవ్వకముల వలన, ఆలయము యొక్క పునాది కూడా ప్రమాదస్థితిలో ఉన్నది. ఈ ఆలయప్రాంగణము నందు బౌద్ధస్తూపములును, శివలింగములును, చెదురు మదురుగా పడిఉన్నవి.

పురాతన శాసనములు (Inscriptions) ఈ ఆలయమునందు సంస్కృతము, తెలుగు మరియు బ్రాహ్మీ భాషలలో మొత్తము తొమ్మిది ఉండెనని రికార్డులో ఉన్నను, ప్రస్తుతము అందులో, ఆరు మాత్రమే లభించుచున్నవి. ఈ శాసనములందు మిక్కిలి పురాతనమైనది కలదు. దానిప్రకారము పల్లవ చక్రవర్తులకు సామంతరాజైన ఖాండారరాజు (కాంతార) చేజెర్లను రాజధానిగా చేసికొనెనని తెలియుచున్నది. ఆ వంశపురాజులు క్రీ॥ శ॥370 నుండి 500 వరకు పాలన చేసిరి. చారిత్రిక విషయములను బట్టి, ఈరాజు, బౌద్ధమతమును ప్రోత్సహించి, ప్రచారము చేసినప్పటికి, బ్రాహ్మణులకు ఆలయములకు భూదాన, హిరణ్యదాన గోదానములను చేసెను.

ఇచట ధ్వజస్తంభముపరిసరములందు 7, 12, 13, 19వ శతాబ్దములకు చెందిన నాలుగు శిలాశాసనములు కలవు. కె.ఆర్. సుబ్రమణియం రచించిన "Buddhist remains in Andhra and the History of Andhra between 225 and 610 A.D." గ్రంథము ప్రకారము క్రీస్తు పుట్టుకకు పూర్వమే, ఆంధ్రలో

బౌద్ధమతము కలదని, అది 4వ శతాబ్దము వరకు ప్రబలమై ఉండెనని తెలియుచున్నది.

ఈ గ్రంథముననుసరించి, చైత్యములును, బౌద్ధస్తూపములును, ఆనాడు నాగార్జున కొండ, చేజెర్ల గరికపాడు, చేబ్రోలు, భట్టిప్రోలు, అమరావతిలలో ఉన్నవని తెలియుచున్నది. దీనినిబట్టి, తొలుత, బౌద్ధ చైత్యముగా ఉన్న చేజెర్లలోని చైత్యమును, క్రీ॥ శ॥ 3–4 శతాబ్దములలో, కపోతేశ్వర ఆలయముగా మారినట్లుగా భావింపబడుచున్నవి. గజెటీర్ ప్రకారము "ఆంధ్రమండలమందుగల ప్రాచీన దేవాలయములలో చేజెర్ల ఆలయము ఒకటి" –

ఐతిహాసికముగ, మనకు శిబి చక్రవర్తి యొక్క దానగుణము విదితమైన విషయమే కదా – దీనికి సంబంధించిన ఐతిహ్యము ఈవిధముగా ఉన్నది :–

"అగస్త్యమహాముని ఆశీర్వాదమును పొందిన శిబి చక్రవర్తి నూరు యజ్ఞములను చేయు తలంపుతో చేజెర్ల చేరెను. అతనిని పరీక్షింపతలచిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, ముమ్మరును, అనగా విష్ణుమూర్తి ఒక పావురముగను, శివుడు వేటగానిగను, పరమేశ్వరుడు బాణముగను మారిరి. అందు, ఆ పావురము తనకు ఆహారముగ పొందుటకై శివుడు (వేటగానిగ) దానిని వెంబడించుటచే, అది ప్రాణభీతిచే శిబిచక్రవర్తిని చేరి శరణు కోరినది. శిబి చక్రవర్తి ఆ పావురము ఎంతబరువుగలదో, అంత బరువు మాంసమును తన దేహమునుండి కోసి తీసి యిచ్చెదనని వేటగానిని ఒప్పించెను. ఆ ప్రకారమే అతడు తన రెండుచేతులను తలను ఖండించుకొనుటకు సిద్ధపడుచుండగా త్రిమూర్తులు అతని సాహస, ఔదార్య, దానగుణములకు ప్రీతి చెందినవారై అతనికి సాయుజ్యమును (మోక్షము) కలుగచేసిరి. శిబిచక్రవర్తి కోరికపై శివుడు, అనగా పావురము పేరున లింగాకారమును ధరించి, మందిరములో చేజెర్లలో వెలసెను, అదియే "కపోతేశ్వర ఆలయము".

దీనికి సంబంధించి మరి ఒక గాథ మహాభారతములో ఉన్నది. ఆ గాథను అనుసరించి, ఒక పావురము ఒక డేగ వెన్నంటి వచ్చుచుండగా, ఆ పావురమునకు తన దేహమునుండి మాంసమును కోసి ఇచ్చిన ప్రదేశము చేజెర్ల. ఆ శిబిచక్రవర్తి స్మృతి చిహ్నముగా, ఈ ప్రదేశములో "కపోతేశ్వర ఆలయము" ప్రతిష్ఠితమైనది.

# శ్రీ కాళేశ్వర-ముక్తీశ్వర దేవాలయము

## (కాళేశ్వరము - కరీంనగర్ జిల్లా, ఆంధ్ర)

భారతదేశమునగల వివిధ రాష్ట్రములలోను కేంద్రపాలిత ప్రాంతములందును, విష్ణ్వాలయములు, శివాలయములే కాక, దేవ్యాలయములు, మఠములు, మందిరములు, పీఠములు వంటివి కలవు. ఆంధ్రరాష్ట్రమున, అనగా పూర్వము నన్నయ తిక్కనాది కవులు నివసించిన గడ్డపై విష్ణుదేవాలయములును, శివాలయములును కలవు. శైవులలో చాలామంది వీరశైవమతానుయాయులై, కావ్యములను, శతకములను, ప్రబంధములను రచించి, తరించిరి. తిక్కన భారతాంధ్రీకరణము చేయు సందర్భమున "హరిహరనాథు"నకు రూపకల్పనము చేసి, శివకేశవుల అభేదమును వెల్లడించిన విషయము లోక విదితము!

ఆంధ్రప్రదేశ్ నందుగల పలు పుణ్యక్షేత్రాలలో శ్రీ కాళేశ్వర - ముక్తీశ్వర దేవాలయమునకు ప్రత్యేకత, ఐతిహ్యము, స్థలపురాణము కలవు.

ఇది ప్రధానముగా పుణ్యక్షేత్రము. ఒక దివ్యారామము. ఇచట శ్రీ కాళేశ్వరస్వామి మరియు ముక్తీశ్వరస్వామి ఒకేపానవట్టముపై వెలసి, భక్తులకు దర్శన భాగ్యమునిచ్చుట విశేషము – ఈదైవద్వయము జీవాత్మ, పరమాత్మలుగా కీర్తింపబడుచున్నారు.

ఒక ఐతిహ్యము (జనపారంపర్యముగా వచ్చినది) ననుసరించి పూర్వము విశ్వకర్మ నిర్మించిన కాళేశ్వరపట్టణము, యమధర్మరాజునకు అందచేయబడినది. సప్తర్షులలో నొకడైన గౌతమ మునీంద్రుడు తెచ్చిన గౌతమీనది కఠోరమగు తపము చేయగా, పరమశివుడు ప్రత్యక్షమై, ఆ నదీమతల్లి కోరికననుసరించి సమస్త పాపములను హరింపచేయునట్టి యమకుండముతో పాటుగా బ్రహ్మ, అచ్యుత, జ్ఞాన, పక్షి, సంగమ, హనుమంత, వ్యాస, నరసింహ అనబడు ఎనిమిది తీర్థములను కల్పించి, పవిత్రమైన ఆ గౌతమీ (గోదావరీ) నదీతీరమున కాళేశ్వరమున, ముక్తీశ్వర దైవముగా, స్వయముగా వ్యక్తమయినాడు.

ఆవిధముగా ఆవిర్భావము చెందిన ఆ ముక్తీశ్వరస్వామిని ప్రజలు భక్తి ప్రపత్తులతో సేవించుచుండిరి. అందువలన వారికి స్వర్గలోకప్రాప్తి (మోక్షము) కలుగుచుండెను. ఈవిధముగా జరుగుటవలన నరకమునకు పోవువారు

లేకపోయిరి ! అందువలన యమధర్మరాజునకు పని లేకుండెను. ఈ విచిత్ర పరిస్థితికి అతడు దిగులుచెంది కైలాసమునకుపోయి, పరమేశ్వరుని దర్శనము చేసికొని, తన దిక్పాలనాయకత్వమునకు భంగము వాటిల్లెనని విన్నపము చేసికొనగా పరమశివుడు అతడికి అభయమిచ్చి ముక్తీశ్వరమునకు దక్షిణ భాగమున (యముడు దక్షిణదిక్కునకు అధిపతి) అదే పానవట్టము మీద మరియొక శివలింగమును ప్రతిష్ఠింప నానతినిచ్చెనట ! ఈవిధముగా చేయుటలోగల ఆంతర్యము ఇది - ఈ క్షేత్రమును సందర్శించు భక్తులు ముందుగా యమధర్మరాజు ప్రతిష్ఠించిన శ్రీకాళేశ్వరస్వామి వారిని సేవించి, పిదప ముక్తీశ్వరస్వామినారాధించినపుడు మాత్రమే స్వర్గమునకు వెళ్లగలరని, ముక్తిని పొందగలరని వరము నిచ్చెనట !

ఆ వరము కారణముగా నేటికీ ఈ క్షేత్రమును సందర్శించు భక్తులు, యాత్రీకులు ముందుగా శ్రీ కాళేశ్వరస్వామివారిని సందర్శించిన తరువాతనే, ముక్తీశ్వరునికి పూజాదికములు చేయుచున్నారు.

ఈ ముక్తీశ్వరస్వామివారికి రెండు నాసికారంధ్రములున్నవి. భక్తులు ఈ రంధ్రములలో నీరు అనగా అభిషేకజలమును పోసినపుడు, ఆ జలము భూమార్గము గుండా సరస్వతీ నదీ రూపములో పవిత్రమైన త్రివేణీ సంగమములో కలియుచున్నదను నమ్మకము కలదు.

విశేషమేమనగా ఈ క్షేత్ర ప్రాంగణమునందు శ్రీ బాలసరస్వతీదేవి అమ్మవారు మరియు చిత్రగుప్తుడు వేంచేసియున్నారు ! ఈ దేవాలయ శిల్ప సంపద ప్రశస్తమైనది.

కాళేశ్వర క్షేత్ర దర్శనము చేయుభక్తులకు కరీంనగర్ నుండి మరియు వరంగల్ నుండి బస్సు సదుపాయమున్నది. వరంగల్ రైల్వేస్టేషను నుండి చేరవచ్చును. హైదరాబాదుదగ్గరగా విమానాశ్రయమున్నది. యాత్రికులకు దేవస్థానసత్రములో వసతి సౌకర్యములు కలవు. ఇచట పూజాదికములతో పాటుగా, ప్రత్యేక దినములలో కోటి బిల్వార్చన, కోటికుంకుమార్చన జరుపబడుచుండును.

# శ్రీ అహోబిలమఠము

## (కర్నూలు జిల్లా, ఆంధ్రప్రదేశ్)

భారతదేశ చరిత్ర అనాది నుండియు విశిష్టమై, విలక్షణమై, విభిన్నరూపములలో సాంస్కృతిక, ఆధ్యాత్మిక వారసత్వమును పుణికి పుచ్చుకొనినది. ఎందరెందరో మహర్షులు, జ్ఞానసంపన్నులు, అవతార పురుషులు, యోగీంద్రులు, సాధుపుంగవులు, తత్త్వవేత్తలు, వేదాంతులు వివిధ కాలములలో మనదేశమున గల వివిధ ప్రాంతములలో జన్మించి, తమదైన బాణిలో తమదైన వాణితో ఆధ్యాత్మికముగా అమూల్యమైన, అజరామరమైన మరియు ఆచరణీయమైన సందేశములను అందజేసిరి. వారు గ్రంథముల ద్వారా ఉపన్యాసములద్వారా తమ బోధనలను అందజేసిరి. అట్టి మహనీయుల సాధన, పరిశోధన, బోధనల మూలమున, భారతదేశమున ఆధ్యాత్మిక పరమైన పరిణామము పరిపుష్టమైనది!

మనదేశమున గల సనాతన ధర్మమును ఒక మతముగా పరిగణింపరాదు. అది శాశ్వతమైనది. అన్ని వర్గముల వారికిని, అన్ని వర్ణములవారికిని అనుసరణీయమైన ఒక సమున్నత జీవన విధానముగా, భారతీయ వారసత్వము తెలుపుచున్నది. పల్లెలు, పట్టణములు, జనపదములు, తుదకు మహానగరములు – ఎచ్చటనైనను మానవునికి ఉనికిని, మనికిని ప్రసాదింపగల దివ్యారామములు ఆలయములు, చైత్యములు, క్రైస్తవ మందిరములు, మసీదులు, మఠములు, పీఠములు గ్రామ దేవతాలయములు దర్శనీయమై మన అధ్యాత్మిక వారసత్వ విశిష్టతను, విలక్షణమును చాటుచుండును. అట్టి మఠములలో భగవాన్ శ్రీశ్రీశ్రీ నరసింహ స్వామివారి అవతార భూమికగా వెలసిన అహోబిలక్షేత్రమునకు ప్రశస్తి, ప్రాశస్త్యము కలవు. ఆరు శతాబ్దముల చరిత్ర గల ఈ అహోబిలమఠము, దర్శనీయమైనది. ముక్తిదాయకమైనది.

క్రీ॥ శ॥ 1398లో మనదేశమున వివిధ ప్రదేశములలో సనాతన ధర్మ ప్రచారము చేయుట కొరకు భగవత్ స్వరూపులైన శ్రీ నరసింహస్వామివారే ఈ మఠమును నెలకొల్పిరి. మరియు మన పురాతన విలువల పరిరక్షణము నందు, అధ్యాత్మిక సాధనయందు, ఈ మఠము నాటినుండి నేటివరకు ఒక అవతార



క్షేత్రముగా ప్రశంసనీయమైన పాత్ర నిర్వహించుచున్నది! మఠము అను పదమునకు ''సన్యాసులు లోనగు వారుండెడు చోటు'' అని అర్థము. పరివ్రాజకులు, దైవభక్తి అధ్యాత్మిక చింతన గల మహనీయులు, తపోతపులు యిలువేలుపుల పేరున దేశమందున మఠములు నెలకొల్పి తమ జీవన విధానము ద్వారా, బోధనల ద్వారా అధ్యాత్మిక భావములను ప్రజలలో పాదుకొల్పి, విస్తృత ప్రచారము చేసి, తమ జన్మను తరింపచేసికొనిరి.

పవిత్రమగు కృష్ణానదీతీరమునగల పుణ్యక్షేత్రములలో గాణగాపురము, నరసింహవాడి, ఔదుంబర్ వంటి పుణ్యక్షేత్రములవలె శ్రీ అహోబిలము పేరు పొందినది. భగవానునకు ప్రతినిధులగు యోగీంద్రులు సాధు పుంగవులు, సన్యాసులు, అవసరము వచ్చినపుడు తాము ఈ భూమిపై అవతరించి, తమ కర్తవ్యములను నిర్వహించి, తాము తరించుటయేకాక, ఆస్తికులు, భాగవతులు తరించుటకు తోడ్పడుచుందురు.

ఈ అహోబిల దివ్యక్షేత్రములో ఆరు శతాబ్దాల మహోత్సవములో భాగంగా, తే 21-10-98 ది నుండి తే 25-10-98 ది వరకు ప్రత్యేక హోమములు, వేదపఠనములు, అధ్యాత్మిక మహోపన్యాసములు వంటివి ఏర్పాటు చేయబడినవి. ఇందులో భారతప్రధాని శ్రీ అటల్ బిహారి వాజ్‌పేయిగారు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడుగారు, పాలుపంచుకొనుట విశేషము!

అయితే, జీర్ణోద్ధరణ కార్యక్రమము చేపట్టవలసి ఉన్నదని ఆ మఠ నిర్వాహకులు భక్తుల నుండి విరాళములను అభ్యర్థించుచున్నారు. మనదేశములో అనేక ఆలయములు, గ్రామ దేవతామందిరములు, జీర్ణస్థితిలోనున్న వాటిని పునరుద్ధరణ చేయుటకు ''ఉడుత భక్తిగా'' ప్రతివారును ధనసహాయము చేయుట అభిలషణీయము, అభినందనీయము. ఈ అహోబిలమఠములో, నవనరసింహ దేవస్థానమును, ప్రహ్లాద వరద సన్నిధిని, పునరుద్ధరణ చేయవలసి ఉన్నది మరియు ఈ గ్రామమునకు నీటి సరఫరా ఏర్పాటుచేయుటకు, వేదవేదాంత విద్యావరివ్యాప్తి చేయుటకు సుమారు 5 కోట్ల రూపాయలు ఖర్చు కాగలదని తెలియుచున్నది!

ఈ మహత్తర శుభసందర్భమున ఉదారులైన మహనీయులు తగిన చేయూతనిచ్చి, ఈ క్షేత్ర ప్రాచుర్యమునకు తోడ్పడగలరని ఆశింపవచ్చును.

# శ్రీ మహాగణపతి దేవాలయము

## ( తిరువనంతపురము - కేరళ)



ఈ దేవాలయము 1741 సంవత్సరమునకు చెందినది. ఆ యేడాది పద్మనాభపురములో తిరువాన్కూరు సైనిక స్థావరము నెలకొల్పబడినది. ఆరోజులలో వేనాడునకు పద్మనాభపురమే రాజధాని. ఒక సైనికునకు నదిలో దొరికిన ఒక చిన్న గణేశ విగ్రహమును తీసికొని వచ్చి దానిని సైనిక స్థావరమున ప్రతిష్ఠించి పూజాదికములు చేయుచుండిరి. ఆ సైనికుడు తన దుస్తులతో పాటు ఆ విగ్రహమును తన వద్దనే అనునిత్యము ఉంచుకొనుటచే ఏవిధమైన ప్రమాదము లేకుండ ఉండెను. అందువలన, ఆ సైనికునకు ఆ విగ్రహము పట్ల భక్తిప్రపత్తులు కలిగెను !

ఆ నగరములో శివాలయము మరియు మహా విష్ణుదేవాలయము కలవు. కాని, గణపతియే ప్రథమ దైవమును, ప్రమథ గణములకు అధిపతి యగుటచే సైనికులందరును ఆ గణేశ విగ్రహమును భక్తిభావముతో పూజింపసాగిరి !

తరువాత, అనగా 1795లో తిరువాన్కూరు రాజధాని కావడంతో, ఆ సైనికులు తమతోపాటుగ ఆ విగ్రహమును తీసికొనివచ్చి ఆ రోజులలో "Magazine Area" గా ఉన్న తిరువనంతపురము కోట (Fort) లో ప్రతిష్ఠ చేసిరి. ఇప్పుడున్న శ్రీమహాగణపతి దేవాలయమే అది !

మరియొక విశేషము ప్రచారములో ఉన్నది. అది ఏమనగా– గడ్డికోయువాడు ఒకసారి దట్టముగా అరణ్యము వలెనున్న ఆ ప్రాంతమున తన కొడవలితో గడ్డిని కోయుచుండగా అతడికి తెలియకుండా కొడవలికోతకు గురియైన ఒక శిల (Stone) నుండి రక్తము కారుచుండెను. ఇది ఒక దేవతా రూపమని భావించిన ఆనాటి స్థానికులు, భక్తులు ఆ శిలను ప్రస్తుతము గల దేవాలయ ప్రదేశమున నెలకొల్పిరి.

తరువాత, రాష్ట్ర పటాలము (State Force) మదరాసురెజిమెంటుతో విలీనమయినందున, ఆ ఆలయ వ్యవహారములు మదరాసు రెజిమెంటల్ సెంటర వెల్లింగ్టన్‌కు (Nilgiris) మార్చబడినది. అచట ముగ్గురు సివిలియన్ ఆఫీసర్స్

మరియు ముగ్గురు మాజీ మదరాసు రెజిమెంట్ ఆఫీసర్సుతో ఒక సలహా సంఘము ఏర్పడినది. అయితే ఈ సలహా సంఘము మదరాసు రెజిమెంటల్ కేంద్రము పర్యవేక్షణలో పనిచేయుచుండెను.

ఆలయ విస్తరణము, అభివృద్ధి కార్యక్రమములను, ఈ కమిటీ చేపట్టినది. త్వరలోనే, భారీఎత్తున ఆలయము పని పూర్తి అయినది. ఈ నిర్మాణములో ఒక క్రొత్త మంటపము మరియు ఒక గోపురము రూపుదాల్చుట విశేషము. ఆలయము నేల భాగమంతయు చలువరాతితో చేయబడినది.

తే 25–3–1996 దీ న, నూతన మంటప ఆవిష్కార సమయమున ఏర్పాటు చేయబడిన ''కుంభాభిషేకము''లో చాలామంది భక్తులు పాల్గొని ఆ దేవుని దీవెనలందుకొనిరి.

ఈ దేవాలయంవమునందం, ఆగస్టు – సెప్టెంబరంలలో వచ్చు ''వినాయకచవితి'', ఏప్రిల్ – మే నెలలో వచ్చు ''త్రివేదలక్షార్చన ఉత్సవములు'' ప్రధానమైనవి. ప్రతి సంవత్సరము, ఈ రెండు ఉత్సవములు భారీ ఎత్తున జరుగుచున్నవి. వేలాది భక్తులు పాల్గొనుట విశేషము ! ప్రతి దినము భక్తులు అధికసంఖ్యలో ఈ ఆలయమును సందర్శించి, దైవమునకు పూజాదికములు నిర్వహించుచున్నారు, భాగవతులు, తిరువనంతపురము సందర్శించు పర్యాటకులు, ఆలయ సందర్శనము చేయుచున్నారు.

ఈ వినాయక విగ్రహము నందలి విశిష్టత ఏమనగా, సాధారణముగా ఎడమకాలు వంగి ఉండగా, కుడికాలు వంగి ఉన్నది ! ఇది విశేషము – ఎందువల్లననగా కుడికాలు దైవశక్తికిని, ఎడమకాలు లౌకిక శక్తికిని ప్రతీకలుగా భావింపబడుచున్నది. పజవంఘాడి వినాయక దైవము ఈ విధముగా భక్తులచే ఆరాధింపబడి వారిని దీవించుచున్నాడని ప్రజల విశ్వాసము.

మరి ఒక విశేషము – ఈ కోవిలలో కొబ్బరికాయలు అర్పించుట ముఖ్యము – ఇందులో ఆంతర్యము ఇది :– కొబ్బరికాయ పైచిప్ప కఠినముగా నుండి, ప్రపంచములోని మాయను, ఆకర్షణలను తెలుపుచు, వానిని అధిగమించుట కష్టసాధ్యమని వ్యక్తము చేయుచున్నది. కాయలో గల తెల్లని కొబ్బరి స్వచ్ఛతను, సత్యమును కలిగి ప్రభువు యొక్క ప్రతీకగా ఉన్నవి ! కొబ్బరికాయను పగులగొట్టుట అనగా, మాయను తొలగించి, మనుజుడు తనకు కావలసిన

స్వచ్ఛతను, సత్యమును, దైవశక్తిని పొందుచున్నాడు ! ఈ విధమైన ఆరాధన ద్వారా భక్తులు, తమకు కలుగు కష్టనష్టములను తొలగించుకొని, జీవితమునందు శాంతిని, సుఖమును అభ్యుదయమును పొందుచున్నామని వారి నమ్మకము.

అనుదినము, అధికసంఖ్యలో శ్రీ మహాగణపతి దేవుని సేవించి, జీవించుట భాగ్యముగా, భక్తులు భావించుకొనుచున్నారు. ఆ దైవము కృపచూపుచు తమను కాపాడుటయే కాక, ప్రశాంతమగు జీవనము ప్రసాదించుచున్నాడని వారి ప్రగాఢ విశ్వాసము !

ఈ ఆలయము దైవము లీలలు చాలా ప్రచారములో ఉన్నవి. దైవచింతనము, ఆరాధనములలో తృప్తి చెందక, ఆలయమునకు వచ్చు రాబడిని మానవ సేవకై వినియోగించుట ద్వారా ఆలయ ధర్మకర్తలు స్వామి వారికి నిజమైన నీరాజనము నందించుచు తాము తరించుచున్నారు. ఈ విధమైన సేవ అభినందనీయము, అనుసరణీయము, ఆదర్శ ప్రాయమైన పవిత్రకార్యము కూడా!

సామాజిక సేవలో ఒక భాగముగా, ఆలయ కార్యనిర్వాహక సభ్యులు, ఈ దిగువ పేర్కొనబడిన విధముగా తమసేవలను అందించుట అతిముదావహము:-

ఎ) 70వేల రూపాయల ఖర్చుతో, బడిలో చదువుకొనెడి పేద విద్యార్థులకు సుమారు 650 మందికి, యూనిఫారం దుస్తులు అందించుట.

బి) తెలివైన విద్యార్థులు, పై చదువులు కొనసాగించుట కొరకు, ఒక్కొక్క విద్యార్థికి మూడువేలరూపాయల చొప్పున ఉపకార వేతనములను (Scholarships) అందచేయుట, ఇది ప్రతి యేడాది జరుగుచున్నది.

సి) ''శ్రీచిత్రాహోమ్'' లేదా ''మహిళామందిరము'' నకు చెందిన నిరుపేద యువతికి ఆమె వివాహము సందర్భముగా తగిన విరాళమునిచ్చుట, ఇది శాశ్వతముగా ఏర్పాటు చేయుట.

డి) పేదల వినియోగము కొరకై ఆసుపత్రులలో వైద్య పరికరములను ఉచితముగా నిచ్చుట తిరువనంతపురములో గల ఒక ఆసుపత్రికి పేదలకై లక్షరూపాయిల విలువ గల ECG యంత్రమునందచేయుట, అట్లే కొన్ని సైనిక ఆసుపత్రులకు పరికరములనిచ్చుట, మందులను సరఫరా చేయుట.

ఇ) అనాధ శరణాలయములందు శ్రీ చిత్రాహోమ్‌లోను గల, ప్రతిభావంతులైన బాలబాలికలకు, వారి అభివృద్ధికై అవసరమైన వస్తువులను సమకూర్చుట.

''శ్రీ మహాగణపతి సేవాశ్రమము'' అను దానిని వృద్ధుల సంరక్షణ సంస్థగా నెలకొల్పి నిర్వాహకులు వృద్ధులకు తగిన భోజనవసతి సదుపాయములను, తక్కువ ఛార్జీలకు అందించుచున్నారు. ఇచట వృద్ధుల పట్ల జాగ్రత్త చూపుటయే కాక వారికి రక్షణ చింతలేని జీవనములను కల్పించుచున్నారు!

మానసికవైద్యాలయములలో రోగులు అనుభవించుచున్న కష్టముల నివారించుటకు, కమిటీ నిర్ణయించుకొనినది. అందులకై వారు రోగులకు మంచములు, దుస్తులు, సబ్బులు, ఎలక్ట్రిక్ ఫ్యానులు మరియు టి.వి. సెట్లను అందచేయు పని ప్రారంభమైనది!

రాజకీయనాయకులు వేదికగా ఉండి, నిరుపయోగమైపోతున్న ప్రాంతమున త్వరగా పెరిగే చెట్లను నాటుటకు కమిటీ నిశ్చయించుకొని, నగరపాలకసంస్థ అనుమతిని కోరినది. ఇక కంప్యూటర్ విజ్ఞానము, వైద్యవిద్య ఇంజనీరింగ్ డిప్లోమా కోర్సులు ప్రవేశపెట్టి అర్హత గల విద్యార్థులకు తోడ్పడుట ఒక గమ్యం! దీనికి కావలసిన స్థలసేకరణకై ప్రయత్నములు జరుగుచున్నవి.

ఆసక్తి, భక్తి గలవారికి, తాంత్రిక మరియు వేదవిద్యను బోధించుటకై ఆలోచన ఉన్నది, శిక్షణ ఇచ్చి, అట్టివారిని ఆలయములందు అర్చకులుగా నియమించుట వీరి ఆశయము. కేవలము ఆరాధన, పూజాదికములకే పరిమితముకాకుండ, అవసరమైన వారికి సామాజికముగా సమయోచితమైన వివిధ సేవలను అందించుట ధ్యేయముగా పెట్టుకొన్న ఈ దేవాలయ నిర్వాహకులు ఆ దిశగా పయనించి అనతి కాలమునందే తమ ఆశయములకు కార్యరూపము కల్పించుట బహుధా ప్రశంసనీయము! భక్తులందచేయు కానుకలు, దక్షిణలు, వస్తు సామగ్రి, నగదు విరాళములు, ఆభరణములు – వీనిని స్వీకరించి గణపతి స్వామికి నివేదించి, ప్రజలు మరియు స్వచ్ఛంద సంస్థల సహకారముతో పురోగమించుట ద్వారా తాము స్వామి వారి కరుణకు పాత్రులు కాగలమని ఆలయ నిర్వాహకులు సేవా కార్యక్రమములు చేయుచున్నారు! అందులకు వారికి అభినందనలు!

ఉత్తరభారతము కన్న దక్షిణ, పశ్చిమ భారత రాష్ట్రములందు, గణపతి

మందిరములు అధికముగానున్నవి. విశేష భక్తి ప్రపత్తులతోడను, విలక్షణమైన విధానములతోడను, విశిష్టమగు పూజలనందుకొనుచున్న శ్రీ గణపతి దేవుని గూర్చి కొన్ని పరిశోధనలు జరుగుచున్నవి.

కుమారి అనితారామధావన్ అను పరిశోధకురాలు "Understanding Ganapathi's Insights into the Dynamics of a Cult" అను తమ గ్రంథమునందు గణపతి హిందూ దైవతములలో ప్రధాన దైవతముగా నెట్లు ఆవిర్భవించినదీ తెలుపుచు, కొన్ని చారిత్రిక విషయములు వెల్లడించిరి। ఆమె దృష్టిలో గణపతి పూజచేయుభక్తులకు చాలామందికి ఆ దైవతమును గూర్చిన ప్రత్యేకత తెలియదు। వారు ఆచారముననుసరించియే పూజాదికములు, ఉత్సవములు నివేదనలు, మొదలగునవి చేయుచున్నారు. ముఖ్యముగా పూజలు, వ్రతములు, నోములు, శుభకార్యములు, మొదలగునవి చేయునపుడు ముందుగా గణపతిని ఎందులకు పూజింపవలెనో తెలియదు।

కుమారి అనితారామధావన్, కొన్ని ప్రాచీన గ్రంథములను హరప్పాశిథిలములను పరిశీలించి ఇట్లు వ్రాసిరి. ''గణపతి బ్రాహ్మణదైవతము, పరమశివుడు, తాను తండ్రియే యైనను (కుమారుడైన) గణపతి పూజ చేసిన పిదప త్రిపురాసుర సంహారము చేసెను। కాని, కొన్ని ఇతరమత సంప్రదాయముల సమ్మేళనము కారణముగా, నాలుగవ శతాబ్దిలో, గణపతిని ప్రత్యేక దైవతముగా ఆరాధించుట ప్రారంభమైనది. తల్లిదండ్రులు, తమ పిల్లలకు గణపతి అను పేరు పెట్టుకొనుట మొదలు పెట్టిరి. ఈ సందర్భమున క్రీ॥ పూ॥ ఆరవ శతాబ్ది నాటికి బౌద్ధులు, జైనులు, ఏనుగు రూపముగల దైవతమును పూజించుచుండిరి। వీరు ఈ దైవతమును సాంకేతికపరముగా (Symbolic) వినియోగించినట్లు చరిత్ర వలన తెలియుచున్నది.''

ఆంధ్రలోని అమరావతి దేవాలయమున, ఏనుగు తలగల యక్షుని విగ్రహము గలదు. దీనిని బట్టి క్రీ॥ శ॥ రెండవ శతాబ్ది నుండి, శ్రీ మహాగణపతి దైవతముగా ప్రతిష్ఠితమై, పూజాదికములను పొందుచుండెనను విషయము, విదితమగుచున్నది.

ఆసక్తి దాయకమగు విషయమేమనగా వినాయకి అనుపేరున, గణపతి స్త్రీ మూర్తిగా ఆరాధింపబడుట, యోగిని పూజలలో ఇది ఒక భాగము -

తాంత్రికముగా, గణపతిని సేవించుట ప్రారంభమైన తరువాతనే ఈ పూజ యోగినులతో ఆరంభమైనట్లు తెలియుచున్నది.

స్కాంద, బ్రహ్మవైవర్తపురాణాలలో, వినాయకుని స్త్రీమూర్తిని గురించిన వివరణ కలదు. చారిత్రికముగా 5వ శతాబ్దిలో మనదేశములో గణపతి పూజలు ప్రారంభమైనవి. కాలక్రమములో వచ్చిన, తాంత్రికారాధనావిధానమువలన, వినాయకునకు ''వైనాయకి'' అను స్త్రీ రూపమును పూజించుట ప్రారంభమై యుండవచ్చును. శ్రీ దేవీనామములందు లంబోదరి, గణేశ్వరి, విఘ్నేశ్వరి అనుపేరులు గలవు.

వినాయకుని పదునారు రూపములలో స్త్రీమూర్తి కలదు. జైనులు, గణేశ్వరి, వైనాయకి అనుపేర్లతోడను, బౌద్ధమతానుయాయులు, గణపతి, హృదయ అను పేరులతోడను స్త్రీమూర్తి ఆరాధన సాగించిరి. అయితే, ఆగమశాస్త్రమునందు స్త్రీమూర్తి ప్రసక్తి లేదు !

ఒక గాథ ప్రకారము, అంధకాసుర సంహారము కొరకు, పరమేశ్వరుడు, జగన్మాత యొక్క మాతృరూపములను సృష్టింపగా, విశేషశక్తి సంపదకల వినాయకి, గణేశుని నామముతో, మాతృగణాధిపత్యము వహించి, రాక్షస సంహారము చేసినది !

గుప్తుల కాలమునుండియు, ఈనాటి వరకు, వివిధ దేవాలయములలో విభిన్న రూపములతో, పలునామములతో అనేక భంగిమలలో వైనాయకి ఆరాధింపబడుచున్నది. వినాయకి స్త్రీ మూర్తి విగ్రహములు, ఉత్తరభారతమునందు కలవు. దక్షిణ దేశములో తక్కువ-శుచీంద్రములో, చతుర్భుజములు కలదిగాను, చిదంబరము, పళని క్షేత్రములలో సగము స్త్రీ రూపముగను, సగము వ్యాఘ్ర రూపముగనున్న విగ్రహములు కలవు. 9వశతాబ్దిలో లభ్యమైన, వినాయకి విగ్రహమునకు ఏనుగు వాహనమైయుండగా, మధ్యప్రదేశ్‌లో లభించిన వినాయకి విగ్రహమునకు, ఎలుక వాహనమై యున్నది. గ్వాలియర్‌లో గల మ్యూజియంలో 'లంబోదరి' కి నాలుగు చేతులలో పరశువు వంటివి ధరించి ఉండగా, కలకత్తా మ్యూజియంలో వినాయకి విగ్రహము, పద్మపీఠముపై, పద్మాసన స్థితిలో జందెము ధరించి ఉన్నది.

# శ్రీ కన్యాకుమారి దేవాలయము

(కన్యాకుమారి - తమిళనాడు)



ఆర్షభూమిగా పేరు పొందిన భారతదేశమునకు చిట్టచివర దక్షిణాగ్రము కలదు. దీనిని స్థానికులు ''కన్యాకుమారి'' గా వ్యవహరించుచున్నారు. ఇది ఒక గొప్ప పుణ్యక్షేత్రము, యాత్రా స్థలము; కేరళ రాష్ట్రమునకు ముఖ్య పట్టణమైన తిరువనంతపురమునకు ఇది సుమారు 87 కిలోమీటర్ల దూరములోనున్నది. ఇచట అతి ప్రసిద్ధమైన మరియు పురాతనమైన కన్యాకుమారి ఆలయమును దర్శించుటకు అన్ని ప్రాంతములనుండియు, పర్యాటకులు, యాత్రికులు, అధిక సంఖ్యలో వచ్చుచుందురు.

మరియొక ప్రశస్తి కలదు. భారతదేశపు భూభాగము అగ్రమిది! మరియు ఈ దేశపు పుణ్యక్షేత్రములలో ఇది చిట్టచివరిది - బంగాళాఖాతము, హిందూ మహాసముద్రము, అరేబియా సముద్రము, యీ మూడును కలిసే చోటు. ఈ దివ్య క్షేత్రము నుండి, సూర్యోదయము, సూర్యాస్తమయము దృశ్యములు నయనానందకరములు!

ఆలయ సందర్శనమునకు పోవునపుడు మనకు పసుపు వర్ణముగల, ఇసుక తిన్నెల ప్రదేశమునందు శ్రీ ఆదిశంకరాచార్యులవారి ఆలయము దర్శనీయమైనది! అతి సమీపమునందే, సముద్రము నందుగల, శ్రీ వివేకానంద ఱాతిమెమోరియల్ ప్రాచుర్యము కలది. ఎందువల్లననగా, శ్రీ వివేకానందులు, కన్యాకుమారికి వచ్చి, సముద్రములోనికి దుమికి, ఈదుకొనుచు, కొంతదూరమున గల ఒక గుట్ట (Rock) చేరుకొని, తపము చేసెను! అందువలన వారికి పాశ్చాత్య దేశాలను సందర్శించవలెనను సంకల్పము కలిగినది. ఈ ఱాతి గుట్టను దర్శించుటకు వీలుగా తమిళనాడు ప్రభుత్వము వారు లాంచీని ఏర్పాటుచేసిరి.

తూర్పు తీరమునందు, కన్యాకుమారికి 4 కి॥ మీ॥ దూరములో లీపురము అను ఓడరేవు కలదు. 8 కి॥ మీ॥ దూరమున గల ''పట్టకోట్టై'' ఒక ప్రాచీనమైన దర్శనీయమైన కోట! (Fort)

ఇక ఆలయ ప్రశస్తి - ఇచట గల రంగురంగుల ఇసుక ప్రదేశమును దాటి,

ఒక బాలికవలె కనుపించు భగవతీదేవి, అనగా కన్యాకుమారిని కానవచ్చును. ఈమెకు, శుచీంద్రము (వేరుగా వివరింపబడినది) నందుగల పరమేశ్వరునితో వివాహమైనదని స్థానికుల కథనం ! కన్యాకుమారికి ఉత్తరదిశగా 10 కి॥ మీ॥ దూరములో నున్న శుచీంద్రమునందు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు (త్రిమూర్తులు) అంకితమైన ఆలయము కలదు.

వివాహము ముహూర్తము నిర్ణయమైనను, ఆ సమయమునకు, పరమశివుడు రాలేదు ! పెండ్లికొరకు తెచ్చిన బియ్యము, మరునాడు, రంగురంగుల ఇసుకగా మారిపోయినదట ! అప్పటి నుండియు ఆ భగవతీదేవి కన్యగా మిగిలిపోయినది. ఈ విధమైన ఐతిహ్యము విషయములో ఇంకను విపులముగా పరిశోధనలు జరుగవలసి ఉన్నది.

గాంధీజీ అస్థికలు 1948 ఫిబ్రవరి 12వతేదీన కన్యాకుమారి వద్ద సముద్రములో నిమజ్జనము చేయబడినవి. స్మారక చిహ్నముగా నాటి కొచ్చిన్ ప్రభుత్వమువారు, ఒక మందిరమును నిర్మించిరి. విశేషమేమనగా గాంధీజీ జయంతి (అక్టోబరు 2వతేది) నాడు, సూర్యకిరణములు, ఈ మందిరమున గల వేదికపై ప్రసరించు విధముగా నిర్మాణము జరిగినది. మరియు ఇచట నిర్మింపబడిన మూడు గోపురములు – సత్యము, అహింస, శాంతికి ప్రతీకలుగా భావింపబడుచున్నవి.

శ్రీ మహాభారతమునందును, ఉపనిషత్తులలోను కన్యాకుమారి ప్రస్తావన కలదు – కనుక – ఇది పురాతనమైన దేవాలయము.

ఈ క్షేత్రమునకు చెందిన మరియొక ఐతిహ్యము కూడా కలదు !

పూర్వము బాణాసురుడను రాక్షసుడు తనకు ఎవరివలనను మృత్యువు లేకుండునట్లు వరమును పొంది, గర్వితుడై సాధువులను సజ్జనులను బాధింపసాగెను. అమాయికులను, ఆస్తికులను వేధింపసాగెను. దేవతలను హింసించుచుండెను. అందువలన దేవతలు దిగులుచెంది, పరమశివుని దర్శించి, ఆ రాక్షసుని దుండగములను వివరించి శరణు కోరిరి. పరమశివుడు, తన యోగదృష్టితో, ఆ రాక్షసుడు ఒక కన్యక చేతిలోనే మరణించునని గ్రహించి, అట్టి కన్యక కొరకు వెదకసాగెను. అపుడు పరమశివునకు ''పుష్యకాశి'' అను పేరుగల కన్య కనుపించినది. ఆమె దేవయోనిలో జన్మించినది కావున, దివ్యమగు

శక్తులను కలిగియుండెను.

పరమశివుడు, ఆ కన్యక ద్వారా, బాణాసురసంహారము చేయ నిశ్చయించుకొని, ఆమెను అందులకై నియమించెను! పుష్యకాశి భూమిపై తన తనువును చాలించి, మోక్షమును పొందుటకై వేచియుండెను. భూమిపై నుండియే శివసాన్నిధ్యము పొందుటకై శివుని గూర్చి తపము చేసెను. కాని, శివుడు ఆమె భూమిపై మరికొంత కాలము ఉండవలెనని ఆదేశించి, దీవించి అంతర్థితుడయ్యెను!

ఇది ఇట్లుండగా విష్ణువు, పరశురామావతారమును ధరించి భూమండలమునకు వచ్చెను. పుష్యకాశి వలననే భూమికి రక్షయుండునని తలంచి, పరశురాముడు తన గండ్ర గొడ్డలితో సముద్రమును వెనుకకు కొంతమరలించి, సముద్రుడు తనకు ఇచ్చిన నేలపై, గణపతి విగ్రహమును ప్రతిష్ఠ చేసెను. పుష్యకాశి ఆ విగ్రహమునకు దక్షిణ ముఖముగా నుండి, తన దృష్టితో సముద్రము ముందునకు రాకుండా నిలిపి వేసినది!

నేటి హిందూమహాసముద్రము నందున్న అనాటి రావణాసురుని లంకను ముంచివేసి, త్రేతాయుగమునందు, జలప్రళయమునందు అది ఆఫ్రికా ఖండము నుండి కన్యాకుమారి అగ్రమును వేరు చేసినట్లు భావింపబడుచున్నది. అచట, ప్రతిష్ఠమైన గణపతి దైవము, విఘ్నరాజా అయినందున, కారణజన్మురాలైన పుష్యకాశి తిరిగి దేవలోకమునకు పోకుండ, భూమియందే నిలిపెను. ఆమెయే కన్యాకుమారి.

ఈ విధముగా, భూమిపై శాశ్వతముగా నిలిచిపోయిన ఆ కన్యాకుమారి ఆలయమునకు "త్యాగసుందరీదేవి" ఆలయము అను పేరు కలిగినది.

అభయప్రదాత్రియై, శుభప్రదయై, శోభాయమానమైన కళ్యాణ మహోత్సవముల సందర్భములందు త్యాగసుందరీ దేవిని వివిధ అలంకారములతో పూజాదికములు చేయుచుందురు! ఈమెకు "శ్యామసుందరీదేవి" అను పేరు కూడా కలదు. భారతఖండమునందు, కన్యాగా శాశ్వతముగా నిలిచిపోయిన ఆ దేవి, ఆకాశమునందు కన్యారాశి రూపమున ఉన్నది.

సర్వాలంకార భూషితయై, ఆదేవి శరన్నవరాత్రులలో పర్వదినములలో

సింహ వాహనారూఢమై భక్తకోటికి దర్శన భాగ్యమును కలిగించుచున్నది.

తిరునెల్వేలి నుండి తిండివనము నుండి, తిరువనంతపురము నుండి కన్యాకుమారి క్షేత్రమును చేరుకొనుటకు అనుకూలమైన ప్రయాణ సాధనములు కలవు.

ఈ మందిరము, పరిసరములందున్న సముద్ర తీరమున సావిత్రి, గాయత్రి, సరస్వతి, కన్య, స్థాణు, మాతృ, పితృ మొదలగు తీర్థములు కలవు. మూడు సముద్రములు కలియు చోటున అనగా తీరమునందు 16 స్తంభముల మంటపము కలదు – మరియు శ్రీ శంకరాచార్యస్వామి, శ్రీ వివేకానందస్వామి వారల విగ్రహములు ప్రతిష్ఠితమైన మందిరములున్నవి. బలరాముడు, అర్జునుడు కన్యాకుమారి ఆలయ సందర్శనము చేసినట్లు మహాభారతము తెలుపుచున్నది. ప్రఖ్యాతమైన తమిళ కావ్యము ''మణిమేఖల'' లో కన్యాకుమారి తీర్థముల వివరణ కలదు.

# శ్రీ శనైశ్చర దేవాలయము

## ( తిరునల్లూరు - తమిళనాడు)

శ్రీమన్నారాయణుడు కాలస్వరూపుడు, అతడే నవగ్రహ రూపములను ధరించి మానవుల జీవన విధానమందు మంచిచెడులను, లాభనష్టములను, సుఖదుఃఖములనను, సంప్రాప్తింపచేయుచుండును. ద్వాదశరాశులలో నవగ్రహసంచార కారణమున జాతకునికి ఆయా గ్రహప్రభావముల వలన, ద్వంద్వములు సంభవించుచుండునని, జ్యోతిషము తెలుపుచున్నది. కాలప్రభావమునకు, గ్రహయోగమునకు ఎవరును అతీతులు కారు.

ఆ నవగ్రహములందు, శనైశ్చర గ్రహప్రభావము మంచికి కాని, చెడుకు కాని, గణనీయముగా నుండును. ఎందుచేతననగా శనైశ్చరుడు ఆయువునకు, ఐశ్వర్యమునకు, ఉన్నతపదవులకు, కారకుడైనట్లే, చెడు ఫలితములను కూడా కలిగించుచుండును.

జ్యోతిషము నందు నమ్మకము కలవారు, లభ్యమగు నట్టి తమ జాతక కుండలిలో ముఖ్యముగా శనైశ్చర సంచార ప్రభావమును గమనించి దోషమున్నదని తెలిసికొనినపుడు వారు శనైశ్చరునకు ప్రత్యేకముగా శని త్రయోదశినాడు, తైలాభిషేకములు చేసి, నువ్వులను, నల్లని వస్త్రములను దోషపరిహారము కొరకు దానము చేయుచుందురు. కొన్ని సందర్భములందు జపములు చేయు ఆచారమును కలదు.

ఆంధ్రప్రదేశ్‌లోగల మందపల్లిలోని శనైశ్చర దేవాలయమును సందర్శించి పూజలు, అభిషేకములు, దానములు, జపములు చేసికొని శనైశ్చరుని శాంతింపచేయువారు చాలామంది కలరు.

అట్లే, తమిళనాడున గల పుదుచ్చేరిలో కరైకాల్ సమీపమున తిరునల్లూరునందు ప్రసిద్ధిపొందిన శనీశ్వర దేవాలయము కలదు. శని, కుంటియగుటచే, మందుడని అందురు. ఒక రాశినుండి మరియొక రాశికి శనైశ్చరుడు మారుట మందముగా (మెల్లగా) జరుగును. రెండున్నర యేండ్లకు ఒకసారి, ఒక రాశినుండి మరియొక రాశిలోనికి ప్రవేశించును.

శని వీక్షణము వలన కలుగు చెడుగులనుండి, ఆపదల నుండి, ఆర్తి నుండి,

విముక్తి పొందుటకై తమిళనాడు నుండియే కాక, దేశములోని ఇతర ప్రాంతములనుండి అనేకులు ఈ ఆలయమునకు వచ్చి, విహితమైన పూజా దికములను శాస్త్రోక్తముగా చేయుచున్నారు.

సాధారణముగా, కొన్ని ఆలయములందును, మఠములందును నవగ్రహములు ఒకచోటనే యుండును. వీని చుట్టును ప్రదక్షిణములు చేయుట ద్వారా నవగ్రహములను శాంతింపచేయవచ్చునను నమ్మకము కలదు. కాని, తిరునల్లూరు శనైశ్చరాలయమందున, మిగిలిన ఎనిమిది గ్రహములు లేవు! ఈ ఆలయమునకు సంబంధించిన ఐతిహ్యమిది :-

పూర్వము నల మహారాజు, దమయంతి ఒకరినొకరు ప్రేమించుకొనిరి. కాని, తమలో ఎవ్వరైనను వివాహమాడవలెనని కోరుచు, దేవతలు నలునిద్వారా రాయబారము నడిపిరి. వారి కోరికను, తన ప్రార్థనము ద్వారా నిరాకరించి వారిని ఒప్పించి, వారి దీవెనలతో దమయంతి నలుని వివాహమాడెను.

దమయంతీ స్వయంవరము జరిగిన తరువాత ఆలస్యముగా వచ్చిన కలి, నలదమయంతులకు, వియోగము కలిగించి, వారికి కష్టనష్టములు కలుగచేసెను. ఇది అంతయు శని ప్రభావము వలన కలిగెనని, తెలిసికొనిన నలుడు తిరునల్లూరునకు వచ్చి పుష్కరిణిలో స్నానము చేసి శ్రీ దర్భారణ్యేశ్వర దేవాలయమున భక్తి ప్రపత్తులతో పూజలు చేసెను. పవిత్రమగు దర్భలతో కూడినది అగుటచేత ఈ పేరు వచ్చినది. ఇచట ప్రాణేశ్వరీదేవి అధిష్ఠానదేవత. ఈ గుడికి దగ్గరగా శ్రీ శనైశ్చరాలయము కలదు. నలుడు స్నానము చేసిన పుష్కరిణిని నలతీర్థమని అందురు.

శనైశ్చరుని ఆలయమునందు కుడ్యభాగములో ఒక చిన్న విగ్రహము కలదు. అదియే శనైశ్చర విగ్రహము ఈ విగ్రహమునకు బంగారు తొడుగు (కవచము) కలదు. పర్వదినములందును, ప్రతీ శనివారమునందును ఇచట పూజాదికములు, అభిషేకములు, దానములు, నివేదనములు జరుగుచుండును. అధికసంఖ్యలో భక్తులు ఆలయమునకు అన్ని ప్రాంతములనుండి వచ్చుచున్నారు.

విలువైన రత్నములతో తయారుచేయబడిన రెండుకండ్లను (Two eyes), మైసూరు మహారాజావారు, ఈ ఆలయమునకు సమర్పించిరి. అతి ప్రధానమైన, సప్త క్షేత్రములలో తిరునల్లూరు ఒకటి! దేవేంద్రుని వద్ద నుండి తాను పొందిన

పవిత్రమైన లింగమును, ముచికుంద చక్రవర్తి ఇచట ప్రతిష్ఠ చేసెనట ! మాన నిర్మితము కాని, ఒక అమూల్యమైన ''పచ్చలింగము'' (Emerald Linga), ఇచ ఒక పెట్టె యందుంచి, భక్తులకు చూపించుచుందురు.

ఈ ప్రాంతమున, శ్రీ త్యాగరాజమందిరము కలదు; శ్రీ త్యాగరాజ దేవు భార్యపేరు, నీలోత్పలాంబ - ఈ ఆలయ సందర్శనము కావించు భక్తుల ఆస్తికులు, భాగవతులు, సాధుపుంగవులు, మతాచారపరాయణులు, పిన్నల పెద్దలు - నదిలో స్నానము చేసి, పిమ్మట దగ్గరలోనే ఉన్న నలకూపము (నూతి నుండి, జలములను తీసికొని గ్రహదోషపరిహారము కొరకు, తమ శిరముల జల్లుకొందురు ! నలుని ప్రార్థనపై గంగ ఈ నూతిలోనికి వచ్చినదని ప్రతీతి !

తరువాత వారు గుడిలోనికి పోయి, నూనె దీపములను వెలిగించి, నువ్వుల మొదలైన వానిని దానము చేసి భక్తి తాత్పర్యములతో, పూజాదికముల చేయుచుందురు.

ముఖ్యముగా శనైశ్చరుడు రాశి మారునపుడు, లక్షలాది యాత్రికులు ఈ ఆలయమునకు వచ్చెదరు - భారత దేశమునకు అంతటికిని ఈ ఆలయమే అతి ప్రధానమైనది ! చాలాకాలము నుండి, ఎందరో భక్తులు, యోగులు ఋషులు, సంకీర్తనాచార్యులు, శనైశ్చరుని సేవించి, కీర్తించి తరించుచున్నారు అరుణ గిరినాధుడు అను భక్తుడు అనేక భక్తిగీతములను ఇచట ఆలపించెను !

ఇచట గల ''నల-నారాయణ'' అనబడు ఒక వైష్ణవ దేవాలయమును భక్తులు సందర్శించి పూజాదికములు చేయుచుందురు.

శనైశ్చరునికి కాకి వాహనము - వెండితో నిర్మింపబడిన కాకిని, ఉత్సవములందు ఊరేగించుచుందురు ! ముఖ్యముగా శనైశ్చరునకు ప్రీతిపాత్రమైన ''కోటి అర్చన'' ఇచట జరుగుచుండును !

# శ్రీ సాయినాథ మందిరము

## (కర్ణాటక)



బెంగుళూరు నగరము, జనసమ్మర్దము గల మల్లేశ్వర ప్రాంతములోని సంపంగిరోడ్ (14 క్రాస్) లో అసంఖ్యాకులైన భక్తులకు ఆరాధ్య దైవమైన శ్రీసాయినాథుని మందిరము కలదు. ఇచట భక్తి స్ఫూరకమగు శ్రీసాయిబాబా వారి నిలువెత్తు, పాలరాతి విగ్రహమున్నది.

ఈ విగ్రహమునకు శిరోభాగముపై ఒక ఛత్రము కలదు. షిరిడీ సాయినాథునికి కుచ్చుల ఛత్రము పట్టిన దృశ్యము, షిరిడీలోనున్నదానిని, ఇది తలపింపచేయుచు, విలక్షణమైన విగ్రహముగా భక్తుల సేవలనందుకొనుచున్నది!

ఆలయము లోపలి భాగములో మూడు గోడలపై శ్రీసాయి చిత్రములు, వానితో పాటు వారి బోధనము, ఇంగ్లీషు, కన్నడ భాషలందు కలవు. ఈ ఆలయము ప్రాంగణమంతయు అందమైన చలువరాతితో చేయబడినది. ఇచట భక్తులు, వరుసలు తీర్చి కూర్చొని ధ్యానము చేయుటకు, భజన కీర్తనలు పాడుకొనుటకు చాలా అనుకూలముగాను, ఆహ్లాదకరముగానున్నది. శ్రీ బాబావారి బోధనలలో, ముఖ్యమైన శ్రద్ధ, సాబూరి అనువానిని తెలుపు దీపములు కలవు.

ప్రత్యేకమైన పర్వదినములందే కాక, గురువారములందు ఇచట ప్రవచనములు, సంకీర్తనములు, ఉపన్యాసములు జరుగుచుండును.

నన్ను అమితముగా ఆకర్షించిన విషయము ఇది :- ప్రతి గురువారము, ఉదయం 10 నుండి 12 గంటల వరకు, శ్రీ ఎల్.ఆర్. బాలసుబ్రహ్మణ్యము (హృద్రోగ నిపుణులు) శ్రీ టి.సి. నాగరాజు (నేత్ర వైద్యులు), శ్రీ పి.ఎస్.ఎల్. రావు (శిశు వైద్యులు), శ్రీ మురళీధర్ కె. రావు (ఎముకల వైద్యులు) మరియు శ్రీ గోకుల్ దాస్ (వైద్యసేవ), తమ సేవలను ఉచితముగా అందచేయుట ప్రశంసనీయము మరియు హర్షదాయకము – ఈ విధమైన ఏర్పాటు ద్వారా వారందరు బాబావారికి ప్రీతిని కలిగించు మానవసేవ చేయుచు, తద్వారా మాధవసేవ చేయుచు ధన్యులగుచున్నారు!

# శ్రీ రేణుకాదేవి ఆలయము

## (కర్ణాటక)

భారతీయు జీవన విధానము నందు, ప్రకృతి సౌందర్యారాధన, దేవతారాధన, తీర్థయాత్రాచణము వంటివి ప్రధానములై ఉన్నవి. ఇవి చాలా కాలము నుండి వచ్చుచున్నవి. కర్ణాటక రాష్ట్రమునకు, ముఖ్యపట్టణమైన బెంగుళూరు మహానగరమునకు చరిత్ర, సంస్కృతి, ఐతిహ్యాము కలవు. ఇచట గల నగరపాలక సంస్థను ''బెంగుళూరు మహానగరపాలిక'' (BMP) అని అందురు.

ప్రకృతి సౌందర్యమునకు ప్రతీక అనదగిన ఈ రాష్ట్రమునందు ఆసక్తికరమైన విజ్ఞానప్రదాయకమైన, సంతోషదాయకమైన హంశములు ఎన్నియో కలవు. బెంగుళూరు నగరమందు గల కొన్ని దేవాలయములను నేను సందర్శించి, వానిని గూర్చి, ఈ గ్రంథమున వివరించితిని. నగరమున గల నంది కోవెల, శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయము, హజరత్ దర్గా, పర్యాటకులను, భక్తులను ఆకర్షించుచుండును.

ఈ నగరమునకు కొంతదూరములో గల ధర్మరాజ దేవాలయము, సెయింట్ మేరీ చర్చి, హనుమ మందిరము, జుమ్మా మసీదు, శ్రీ గంగాధరేశ్వర దేవాలయములు, కొన్ని ముఖ్యమైన దర్శనీయమైన పవిత్రమైన మందిరములు !

ఇవి కాక, చారిత్రికముగా ప్రధానమైన కోట, టిప్పుసుల్తాన్ రాజభవనము, సావన దుర్గ, శివగంగ, దేవయానదుర్గము వంటివి కూడా కలవు.

సనాతన భారతీయుల జీవన విధానమున, అతి ప్రధానమైన దైవభక్తి, దేవాలయ సందర్శనముల వలన భక్తులు సాధకులై మోక్షమును పొందెదరు అను విషయము కాన వచ్చుచున్నది.

అరుదైన మానవజన్మను తరింపచేసికొనుటకు, ఆరాధనము, యోగసాధనము, వ్రతానుష్ఠానము, దేవాలయ సందర్శనము, సాగరసంగమ నదీస్నానము, పుణ్యక్షేత్రములను దర్శించుట, మనదేశమునందు, అనాదినుండి వచ్చుచున్న ఆచారములని చెప్పవచ్చును.

భారతీయులు భక్తి ప్రపత్తులతో, ఆరాధన చేయు దేవతామూర్తులు, పలునామములతో, పలురూపములతో, విభిన్న పద్ధతులలోనుండుట ఒక విలక్షణమైన విషయము! శైవ, వైష్ణవ దేవాలయములతోపాటుగ, గణపతి, సూర్య, ఆంజనేయ, దేవాలయములు చాలా కలవు.

అదే విధముగ, శాక్తేయులైన భారతీయులు అధికసంఖ్యాకులు అంబను (అమ్మవారిని), పలునామ రూపములతో ఆరాధించుచున్నారు – ముఖ్యముగా ఇంచుమించు ప్రతి గ్రామములోను, జన పదములందున, నగరములలోను, పల్లెలలోను, పట్టణ ప్రాంతములందును, పలు విధములైన నామములతో, విభిన్న రూపములతో, గ్రామ దేవతలకు భక్తి భావముతో పూజాదికములు, ధూపదీప నివేదనాదులు, ఉత్సవములు, పరసలు జరుగుచున్నవి. కొన్ని ప్రాంతములందు నిషేధింపబడినను, జంతువులను బలిచేయుట ఆచారముగా నున్నది!

ఆంధ్ర రాష్ట్రమునందునను, అమ్మవారిని కొలుచుట ఆచారము సుప్రతిష్ఠితమై యున్నది. ఈ అమ్మవారిని – అంబ, చండి, కాళిక, శ్యామల, దుర్గ, భవతారిణి, పార్వతి, సరస్వతి, చాముండి, భద్రకాళి, రాజరాజేశ్వరి, మహాలక్ష్మి వంటి నామములతోనే కాక పోలమ్మ, నీలమాంబ, ముత్యాలమ్మ, నూకాలమ్మ, పైడిమాంబ, కుంచమాంబ, అంకమ్మ వంటి దేవతానామములతో వేరువేరు రూపములతో పూజించుట జరుగుచున్నది. ఇవి కాక, ఇంకను వివిధ నామరూపములు కల గ్రామ దేవతాలయములు, మనదేశమునందు చాలా ఉన్నవి.

కర్ణాటకలో ప్రకృతి సౌందర్యమునకు పేరుపొందిన మలెనాడులో గల, చంద్రగుత్తి కోట వద్ద గల ఒక గుహలో రేణుకా దేవి ఆలయము కలదు! ఈ దేవి విగ్రహము లింగాకారములో ఉండుట విశేషము –

ప్రతి సంవత్సరము, ఫాల్గుణ మాస శుద్ధ నవమినాడు ఈ దేవి రథోత్సవము జరుగును.

ఈ గుడికి సమీపమునందు, కుడివైపున మాతంగమాత మందిరము, ఎడమభాగమున పరశురాముని ఆలయమును కలవు.

విశేషమేమనగా, ఈ దేవాలయమున నగ్న దేవతారాధనము జరుగుచున్నది! వరప్రదాయినిగా భావింపబడి, సేవింపబడుచున్న రేణుకా దేవి భక్తులపాలిట కల్పవల్లిగా పేరు పొందినది.

భక్తులు తమ కోరికలు ఫలించునపుడు, ఈ దేవతను నగ్నరూపమున సేవింపగలమని, మ్రొక్కుకొను ఆచారమిచట కలదు ! ఆ విధముగనే నేటికిని జరుగుచున్నది. స్త్రీ, పురుష వివక్ష లేకుండా, వారు తమ మ్రొక్కుబడులను చెల్లించుకొందురు. వారు, నదిలో స్నానము చేసి, తమ శరీరములను వేపఆకులతో ఆచ్ఛాదనము చేసికొని, భక్తి పారవశ్యముతో తమ పూజాదికములను పూర్తి చేస్తారు! అయితే, ఈ విధమైన నగ్న సేవనము, మాతంగిమాతకే చెందుతుంది !

ఎచ్చటను కానరాని, ఈ విధమైన దేవతారాధనము, ఎప్పుడు, ఎట్లు ప్రారంభమైనది తెలియదు.

# శ్రీ ప్రసన్న వీరాంజనేయ దేవాలయము

## (మహాలక్ష్మీపురము, బెంగుళూరు, కర్ణాటక)

ప్రకృతి సౌందర్యమునకు నెలవుగా, విహార కేంద్రముగా, పర్యాటక నగరముగా, పరిశ్రమల నిలయముగా, విద్యాకేంద్రముల కూడలిగా, విశాలముగా విస్తరించిన బెంగుళూరు మహానగరము నందు దైవచింతన గల వారికి, ఆస్తికులకు అవసరమైన దేవాలయములు, ప్రార్థనామందిరములు, మసీదులు, క్రైస్తవుల ఆరాధనాలయములు, గురుద్వారములు కలవు. దీనిని ఉద్యాన నగరముగా వ్యవహరించుచున్న విషయము విదితమైనదే।

ఈ నగరములో గల, మహాలక్ష్మీపురము ప్రాంతములో వెలసిన శ్రీ ప్రసన్న వీరాంజనేయస్వామి వారి దేవాలయము భక్తిభావమును కలిగించు ఒక సుందర మందిరమనవచ్చును.

13 ఎకరముల విస్తీర్ణము గల ఒక రాతి గుట్ట (కొండ)పై మహాలక్ష్మి పురములోగల పార్కుదరిని ఈ ఆలయము కలదు.

22 అడుగుల ఎత్తు, 16 అడుగుల వెడల్పు గల అపురూపమైన శిల్పకళతో మిక్కిలి ఉన్నతముగా దర్శనమిచ్చునట్టి ఈ హనుమ విగ్రహము ఉద్భవశిల నుండి వచ్చినది. ఈ ఆలయము యొక్క గోపురము 77 అడుగుల ఎత్తున ఉండి, భక్తులకు దర్శనీయమగుచున్నది। ఇది ఒక దివ్య క్షేత్రముగా అసంఖ్యాకులైన భక్తులకు ఆరాధ్యమై యున్నది!

తొలిసారిగా 1973లో హనుమ ప్రభువు ఒక గుట్టపై తైలవర్ణ చిత్రముగా కనిపించెను। ఆ తరువాత అది శిల్పరూపమున తయారు చేయుట జరిగినది. జూలై 7వతేది, 1976లో ప్రాణ ప్రతిష్ఠాపన మహోత్సవము చాలా వైభవముగా కొనసాగినది!

1982లో ''శ్రీ ప్రసన్న మహాగణపతి'' మరియు ''శ్రీ ప్రసన్న కోదండరామ'' చలువరాతి విగ్రహములు ఇచట నెలకొల్పబడి అదేరోజున ఆలయమున కుంభాభిషేక మహోత్సవము కనులపండువుగా జరిగినది.

దగ్గరలోనే జ్ఞానమందిరము (Abode of Wisdom) తపము చేయుచున్న

ఎత్తైన హనుమంతుని చిత్రము కలదు. భక్తులు కానుకగా అందచేసిన వివిధ సాధుపుంగవుల, యోగుల మతప్రవక్తల చలువరాతి విగ్రహములు ఇచట ఒక ప్రత్యేక ఆకర్షణ – కొన్ని మఠములకు చెందిన మహనీయులు కూడా, ఇట్టి విగ్రహములను అందచేసిరి. ఈ కారణము చేత ఈ ఆంజనేయాలయము యాత్రికులకు, పర్యాటకులకు ఒక భక్తి ధామముగాను, ఒక దివ్యారామముగాను భాసించుచున్నది !

1985లో బంగారుపూత గల 7 1/2 అడుగుల ఎత్తుగల కలశము యొక్క అభిషేకము (మహా కుంభాభిషేకము) శ్రీ ప్రసన్న మహాలక్ష్మీదేవతా విగ్రహ ప్రతిష్ఠాపన మహోత్సవము వైభవముగా జరిగినవి.

భారీ విగ్రహ రూపమున దర్శనమిచ్చుచున్న ఈ ఆంజనేయునకు, ఇరువైపులందున అష్ట గణపతి, అష్టలక్ష్మి విగ్రహ స్థాపన జరిగినది.

ఈనాడు, ఈ దేవాలయము అసంఖ్యాకులైన భక్తులపాలిట, దివ్యమైన, భవ్యమైన ''శాంతి ధామము''గా విలసిల్లుచున్నది. గ్రానైట్ రాతితో తయారైన 60 అడుగుల పొడవు, 40 అడుగుల వెడల్పు గల ఒక అందమైన ప్రార్థనా మందిరము (ధ్యానమందిరము) నిర్మితమై ఏకాగ్రతతో ధ్యానము చేయుటకు భక్తులకు వీలు కల్పించుచున్నది. దీనిప్రక్కనే 1994లో ఒక అధ్యాత్మిక గ్రంథాలయము ప్రారంభింపబడినది. వేలకొలదిగా భక్తులు, వివిధ భాషలలో గల అనేకములైన అధ్యాత్మిక గ్రంథములనందచేయుటచే భక్తులు, పురజనులు ఆయా గ్రంథములను చదువుకొను సదవకాశమేర్పడినది ! దేవాలయ సందర్శనముతో పాటుగా, అధ్యాత్మిక గ్రంథపఠనము, అధ్యయనము, ధ్యానములతో సందర్శకులు అధ్యాత్మిక, వేదాంత, తాత్త్విక సంబంధమైన పరిజ్ఞానమును పొందగలుగుట ఈ ఆలయ ప్రత్యేకత !

13 కోట్ల ''శ్రీరామాయనమః'' అని వ్రాయబడిన భక్తుల పుస్తకములను సేకరించి, వానిని 13రోజులు పూజించి, ఆలయములో ''శ్రీరామ'' భక్తహనుమ విగ్రహములకు సమర్పణ చేయబడినవి. ఇది చాలామంది భక్తగణములకు సాధకులకు ఒక దివ్య భక్తి ప్రేరకముగా నుండి, వారిలో జ్ఞానజ్యోతిని వెలిగించి, తద్వారా జ్ఞానానందమును కల్గించుచున్నది. ఇది దివ్యజ్ఞాన కేంద్రముగా విరాజిల్లుట విశేషము !

ఆలయ ప్రాంగణమునందు, కొత్తగా నిర్మితమైన భవనములో వైద్య శిబిరము ఏర్పాటు చేయబడినది. మే 1996లో ప్రారంభమైన ఈ వైద్యాలయమునందు, పేదవారికి ఆర్థికముగా వెనుకబడి ఉన్నవారికి ఉచిత వైద్యసహాయము లభించుచున్నది.

ఈ ఆలయ వ్యవహారములను ఒక ట్రస్టు నిర్వహించుచు అభివృద్ధికి అవసరమైన పథకములను ప్రవేశపెట్టుచున్నది.

హనుమ విగ్రహమును, పూలహారములతో అలంకరింతురు – ఈ విధమైన దృశ్యము భక్తులకు పరవశత్వమును కలిగించి, వారిలో నిర్మలమగు, నిశ్చలమగు, నిబిడమగు, భక్తిని ప్రసాదించును. హనుమ ప్రేరణతో ట్రస్టు సభ్యులు, ఈ ఆలయమును, బంగారు పూతగల రాగి రేకులతో అలంకరించుటకు నిశ్చయించిరి! అందులకు, వారు భూరి విరాళములను, ధనము, వస్తు రూపములతో సేకరించుచున్నారు. త్వరలోనే ఈ ఆలయము ఆ మేరకు అభివృద్ధిని పొంది అందరకును ఆనందము అందింపగలదని ఆశింపవచ్చును.

మీరు దర్శనార్థమై ఈ మందిరమునకు పోవునప్పుడు, అంజనా తనయుని అనుగ్రహమును పొందుదురు గాక ! అట్లే, మహాలక్ష్మి పురము కోవిలలో గల ''బంగారు కలశమును'' దర్శింతురుగాక! హనుమవిగ్రహమునందు, ఒక చేతిలో సంజీవని పర్వతము, రెండవచేతిలో గదాయుధము దర్శనీయమై, భక్తి స్ఫోరకమై, శ్రీరామదూతగాహనుమ సాహసము, వజ్ర సంకల్పము, కార్యదీక్ష, స్వామిభక్తి మొదలగు విషయములు స్ఫురణకు వచ్చి, భక్తులు అనన్యమైన దివ్యానుభవమును పొంది, తరింతురు !

# శ్రీ కృష్ణ - బలరామ మందిరము

## (బెంగుళూరు, కర్ణాటక)

ధర్మ సంస్థాపనార్థము భగవానుడు పలుసందర్భములలో వివిధ రూపములలో అవతారములు ధరించి, లోకములను కాపాడినాడు. ముఖ్యమైనవిగా భావింపబడుచున్న, దశావతారములలో శ్రీ కృష్ణావతారము విలక్షణమైనది, విశిష్టమైనది, వేదవేద్యులకు,- పామరులకు, భక్తగణములకు, మునిజనములకు, యోగి పుంగవులకు - అందరికిని ఆ కృష్ణ పరమాత్మ, అత్యంతమూ ఆరాధ్యుడైన దైవము !

శ్రీ శంకర భగవత్పాదులవారు, తాము, పరమాత్మ స్వరూపాన్ని ఈ దిగువ శ్లోకములలో వివరించిరి :-

శ్లో॥ సంసార సర్ప సందష్ట నష్టచేష్టైక భేషజమ్ ।
కృష్ణేతి వైష్ణవం మంత్రంశ్రుత్వా ముక్తోభవేన్నరః ॥

(సంసారమనబడు సర్పముచేత కాటు వేయబడి, చేష్టలుడిగిన వానికి, ధ్యానమునకు ఆలంబనమైన శ్రీకృష్ణమంత్రము ఒక్కటే దివ్యమైన పరమౌషధము)

శ్లో॥ ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపః కర్మాత్మకానివై ।
యానితేషామశేషాణాం, కృష్ణానుస్మరణం పరమ్ ॥

(తపో రూపములు మరియు కర్మరూపములూ అయినటువంటి, అసంఖ్యాకమైన ప్రాయశ్చిత్తములందు, కృష్ణానుస్మరణమే ఉత్తమోత్తమమైనది)

శ్లో॥ ఏకోపి కృష్ణస్యకృతః ప్రణామః దశాశ్వమే ధావ/ భృథేన తుల్యః ॥
దశాశ్వమేధీపున రేతి జన్మ కృష్ణప్రణామీన పునర్భవాయః ॥

(శ్రీకృష్ణ పరమాత్మకు చేసిన ఒకే ఒక ప్రణామము, పది అశ్వమేధయాగముల ఫలమునకు సమానము పది అశ్వమేధయాగాలు చేసిన వానికి పునర్జన్మ ఉన్నది - కాని శ్రీకృష్ణునకు ప్రణామము చేసిన వానికి మాత్రము పునర్జన్మ ఉండదు)

బెంగుళూరు మహానగరములో మిక్కిలి జనసమ్మర్దము, వాహనసంచారముగల ప్రాంతములో, నేను శ్రీకృష్ణ బలరామమందిరమును సందర్శించి, ఆనందించితిని.

అంతర్జాతీయ కృష్ణచైతన్య సంఘ సంస్థాపన ఆచార్యులు, పూజ్యశ్రీ ఏ.సి. భక్తి వేదాంతస్వామి ప్రభుపాదులవారు శ్రీకృష్ణ పరమాత్మ భక్తులు, యోగి పుంగవులు. మహనీయులైన వీరు దేశవిదేశములలో కృష్ణచైతన్య కేంద్రాలను నెలకొల్పిరి. వీనిని "ఇంటర్నేషనల్ శ్రీకృష్ణాకాంషస్" (ISKCON); 'ఇస్కాన్' కేంద్రములుగా వ్యవహరించుచున్నారు. అదికాక, అమూల్యమైన అధ్యాత్మికపరమైన అనేక గ్రంథములను హిందీ, తెలుగు, తమిళము, ఇంగ్లీషు మొదలై భాషలలో, వీరి "భక్తి వేదాంత బుక్ ట్రస్ట్", ప్రచురించి ఈ భక్తి సంప్రదాయమును ప్రాచుర్యములోనికి తీసికొనివచ్చుట అత్యంతము, అభినందనీయమైన విషయము!

ఇచట, ఎత్తుగా ఉన్న విశాలమగు గుట్టపై (Hillock), మూడు దేవాలయములున్నవి. అవి - 1. శ్రీ నరసింహస్వామివారి ఆలయము 2. శ్రీ వేంకేశ్వరస్వామివారి దేవాలయము 3. శ్రీకృష్ణ బలరామమందిరములు. వీనిని దర్శింప కోరు భక్తులు, మెట్ల మార్గము ద్వారా పోవలెను. దర్శనము చేసికొని ప్రసాదము స్వీకరించి, మరలునపుడు, మెట్లు కాకుండా, ఒక మార్గము ఏర్పరిచిరి. అందువలన, ఎట్టి పరిస్థితులలోను, త్రొక్కిసలాట, త్రోపులాట ఉండవు! ఇచట పూర్తిగా మౌనమును పాటించవలెను. ఎందుచేతననగా, మందిరమునందుగల అర్చకులు, భక్తులు, 'హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే, హరేరామ హరేరామ, రామరామ హరేహరే" అను ప్రార్థనము చేయుచుందురు. ఇది, మైక్ ద్వారా సందర్శకులకు వీనులవిందుగా వినిపించుచుండును!

నేను సందర్శించిన పెద్ద ఆలయములలో ఇది చాలా పెద్దది! 1997, మేనెల 31వతేదీన అప్పటి భారత రాష్ట్రపతి డా॥ శంకర్ దయాళ్‌శర్మ గారిచే ఈ మందిరము ఆవిష్కారమైనది. ఇచట, శ్రీకృష్ణ-బలరామ, విటల్-గౌరంగ, శ్రీరాధాకృష్ణుల విగ్రహములు, భక్తి స్ఫోరకముగా, దర్శనమిచ్చుట, భక్తులకి అనుభూతి కల్గించును మరియు నియోన్ దీపాల కాంతిలో అందమైన ఊట (Spring) ఆనందమునందించు చక్కని, చల్లని, రమణీయమైన దృశ్యము!

ఇచట నెలకొల్పబడిన ధ్వజస్తంభము చాలా పెద్దది, చాలా ఎత్తయినది కూడా! ధ్వజస్తంభమునకు గల ప్రాముఖ్యమును గూర్చి, ఈ గ్రంథమునందు, "పరశురామ దేవాలయము" నందు వివరించితిని.

పైనచెప్పిన మూడు దేవమందిరముల శిఖరములు, బంగారు పూతగలవి.

ఇచట, విశాలముగా ఉన్న వసారాలలో, రకరకములైన మిఠాయి, దినుసులు, బట్టలు, పటములు, అలంకరణ వస్తువులు విక్రయింపబడుచున్నవి.

ఈ ఆలయములద్వారా, గ్రంథములద్వారా, వ్యక్తమగుచున్న కొన్ని అధ్యాత్మిక విషయములను గురించి, సంగ్రహముగా వివరించుచున్నాను.

కృష్ణచైతన్యమార్గము ద్వారా, మానవులు ఆర్తినుండి అలజడి, ఆందోళనల నుండి విముక్తులగుటయే కాక, ఆనందమయమగు, దివ్యచైతన్యమును, ఈ జీవితమునందే సాధింపగలరు. మనుజులందరును శ్రీకృష్ణ పరమాత్మని అంశములే ! అందువలన, మానవులందరును సోదరసోదరీలు – వారికి శ్రీకృష్ణుడే పరమపిత !

సనాతనుడూ, సర్వజ్ఞుడూ, సర్వేశ్వరుడూ, సర్వవ్యాపీ, సర్వశక్తిమంతుడూ, సర్వమనోహరుడూ, సర్వులకూ ఆరాధ్యదైవమూ మరియు సమస్త సృష్టికి, స్థితికి కారకుడైన, దేవాది దేవుడైన శ్రీకృష్ణుడు భగవద్గీతను ప్రసాదించినాడు !

శ్రీకృష్ణ చైతన్య సాధనద్వారా, ఆరాధన ద్వారా, ఆ భగవానునికి భక్తుడుగా, జన్మమును తరింపచేసికొనుటయే మన లక్ష్యము కావాలి – అదియే మన గమ్యము కూడా ! ఈ ఆశయసిద్ధికై, భక్తులైనవారు, తప్పనిసరిగా దిగువనీయబడిన విధులను, భక్తి శ్రద్ధలతో పాటించాలి, అట్లే, నిషేధాలను కూడా విధిగా పాటించాలి.

విధులు : 1. శ్రీ చైతన్యమహాప్రభువు, భక్తులకు, సాధకులకు ప్రసాదించిన, "హరేకృష్ణ, హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే – హరేరామ హరేరామ రామ రామ హరే హరే", అనుమంత్రమును 108 పూసలు గల తులసీమాలతో ప్రతిరోజు 108సార్లు భక్తితో జపించవలెను.

2. శ్రీ భగవద్గీత, శ్రీమద్భాగవతమునందుగల ఉపదేశములను సూచనలను శ్రీవేదాంతస్వామి ప్రభుపాదులవారు తమ గ్రంథములలో వివరించిన విధముగా అధ్యయనము చేసి, వానిని పరమాత్మునకు కైంకర్యము చేయవలెను

నిషేధములు :–

1. ఏ విధమైన మాదక ద్రవ్యములను సేవింపరాదు.

2. మాంసాహారము, చేపలు, గ్రుడ్లు, ఉల్లి, వెల్లుల్లి వంటి తామసిక ఆసార పదార్థములను విసర్జించాలి.
3. అక్రమమైన నిషిద్ధమైన లైంగిక సంపర్కము కూడదు.
4. లాటరీ, జూదము వంటి వానిని పరిహరించాలి.
5. సాధకులు, పవిత్ర వాతావరణములో, సమర్పణ భావముతో, దైవధ్యానము చేయవలెను.

భక్తులు వాస్తవమైన, దివ్యమైన ఆనందమును శ్రీకృష్ణుని నుండి పొందవలెను. మనము పొందుచున్న భౌతికమైన ఆనందము తాత్కాలికమైనది! మరియు కృత్రిమమైనది ! కాబట్టి, వైదిక సాహిత్యములో చెప్పబడిన, వివిధ భౌతిక, అధ్యాత్మిక విషయాలను, వివేచనతో అధ్యయనము చేయుచు, మానవజీవనము యొక్క నిజమైన గమ్యమును, చేరుకొనవలెను. భక్తుడు ''ధామపరమమ్'' అనగా శ్రీకృష్ణుని దివ్యధామమును చేరుటకై ప్రయత్నించినచో, శ్రీకృష్ణుడే స్వయముగా అట్టి భక్తుని ఆహ్వానించుటకు వచ్చును ! ఆ దివ్య నివాసము చేరుకొనుటకు తపము, వ్రతము, యోగము మొదలైనవి అవసరము లేదు ! ఈ వరము పొందుటకు భక్తుని శరీరమే ఒక అవకాశము, అదియే సాధనము. భక్తియుక్తమైన భావనలతో సేవలతో ఆ దేవదేవుని శరణు పొందుట అవసరము !

# శ్రీ గురువాయూర్ దేవాలయము

(కేరళ)

సర్వశాస్త్రముల సారమూ, భక్తుల పవిత్ర హృదయ సమాహారమూ అయిన శ్రీ మద్భాగవతము నందు, అనేకానేక విషయములతోపాటు, వర్ణనలూ, శ్రీకృష్ణ లీలలూ, సాహిత్యపరముగను, భక్తిసాధనముగను వర్ణితమైనవి.

ఈ చరాచర ప్రపంచము యొక్క ఉత్పత్తి, స్థితి, లయములకు కారణభూతుడై అధ్యాత్మిక, అధి భౌతిక, అధి దైవిక, తాపత్రయములను పరిహరించు, శ్రీకృష్ణ పరమాత్మ సచ్చిదానంద స్వరూపుడు. పరిపూర్ణమైన శ్రీకృష్ణ పరమాత్మ సకల సంపచ్ఛ్రేయములను, సమరస భావనమును, శాంతి మయజీవనమును అనుగ్రహించి, భక్తులను కాపాడుచున్నాడు.

అనేక నామములతో, దేశములో వివిధ ప్రాంతములలో విష్ణుదేవుని ఆలయములు వెలసినవి, అందు ఆరాధనాది కార్యక్రమములు కొనసాగుచున్నవి.

అట్టివానిలో శ్రీ గురువాయూర్ కృష్ణ దేవాలయవిశేషములు ప్రాచుర్యము గలవి. ఇచట ప్రతిష్ఠితమైన శ్రీకృష్ణ దివ్యవిగ్రహము, లక్షలాది భక్తజనసందోహమును ఆకర్షించుచు, వారి వారి, కోరికల నీడేర్చుచున్నది. సాధారణముగా, భక్తులు కొన్ని దేవాలయములను ప్రత్యేక సమయములలోనే దర్శనముచేసికొనెదురు – కాని ఈ ఆలయమున సంవత్సరము పొడవునా, భక్తులు పూజాదికములు, నివేదనములు, చేయుచుండుటవలన, అది నిత్యకళ్యాణము, పచ్చతోరణము వలె భక్తుల సంతోషమునకు కారణమగుచున్నది.

ఆలయమున ప్రవేశింపగనే, భక్తిభావమధికమై, ఒక దివ్యమైన ఆనందానుభవము కలుగును! ఈ ఆలయము అంతపెద్దది కాకపోయినను, ఇది విశిష్టమైన పుణ్యక్షేత్రమై విలసిల్లుచున్నది! దీనికి సంబంధించిన గాథ :

మహాభాగవతము ననుసరించి, పూర్వము శ్రీ మహావిష్ణువు ఈ దివ్య మంగళ విగ్రహమును (Idol) బ్రహ్మ దేవునికిచ్చెను. బ్రహ్మ, కశ్యపునకు దానినిచ్చెను. తరువాత దైవానుగ్రహము వలన, దేవకీవసుదేవులకు ఆ విగ్రహము లభించినది. వారు దానిని ద్వారకలో ప్రతిష్ఠించిరి. అవతారమూర్తియైన ఆ శ్రీకృష్ణపరమాత్మ ఈ విగ్రహమును ఆరాధించెను!

తన అవతారపరిసమాప్తిని తెలిసికొని శ్రీకృష్ణుడు, ఆవిగ్రహమును గురువు (బృహస్పతి) మరియు వాయుదేవుని సహాయము కోరి కలియుగమున ఒక దివ్యక్షేత్రమున ప్రతిష్ఠింపవలెనని కోరెను. ఆ ప్రకారము, వారిద్దరు సంచారము చేసి, దట్టముగా ఉన్న తాటి, కొబ్బరిచెట్లు గల ప్రదేశమును ఎంచుకొని ప్రతిష్ఠింపవలెనను తలంపు రాగా, పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమై, రుద్ర తీర్థము అందులకు తగిన స్థలమని తెలిపిరి. ఈ తీర్థము నందే పరమేశ్వరుడు శ్రీ మహావిష్ణువును ఆరాధించెను.

ఈ సమయమున ప్రచేతసుడు, విష్ణు దర్శనము కొరకు, తపము చేయుటకు అచ్చటికి వచ్చెను. పరమేశ్వరుడు వాని కోరిక తెలిసికొని, రుద్రతీర్థము నుండి వెలువడి, శ్రీమహావిష్ణుస్తోత్రమైన 'రుద్రగీత' ను ప్రసాదించెను. తరువాత అచ్చటనే శ్రీకృష్ణవిగ్రహ ప్రతిష్ఠ జరిగినది ! గురువు, వాయుదేవులచే ప్రతిష్ఠ చేయబడిన ఆ స్థలమున ''గురువాయూర్‌పురము'' అని పేరు వచ్చినది.

ఈ పవిత్ర దేవాలయము యొక్క ప్రత్యేకత ప్రాచుర్యము, ప్రభావము క్రమక్రమముగా విస్తరించుట వలన ఈ ఆలయము, మహాభారత కాలము నాటికే ప్రసిద్ధి పొందినది !

ఈ విగ్రహము ప్రత్యేకత ఏమనగా, అది పాతాళాంజన శిల నుండి చెక్కబడినది ! అందువలన, ఇది మిక్కిలి పవిత్రత పొందినది. ఒకనాడు, శ్రీ మహావిష్ణువు, వైకుంఠమున ఈ విగ్రహమును పూజించెను ! ఈ దేవాలయ సందర్శనము ఈ దివ్యవిగ్రహారాధనము, కలియుగమున, భక్తులకు, మోక్షప్రాప్తినిచ్చి, వారిని తరింపచేయునను ప్రబల విశ్వాసము కలదు.

బృహస్పతి (గురువు), వాయుదేవుడు శ్రీకృష్ణ విగ్రహ ప్రతిష్ఠాపన మహోత్సవమును జరుపునపుడు, పరశురాముడు దానిని తిలకించెను. శ్రీ మహావిష్ణువు ఆరాధించిన విగ్రహమగుటచేత దీనిని అనగా, గురువాయూర్‌పురమును భక్తులు కలియుగ వైకుంఠముగా భావించుచున్నారు.

మరియొక ప్రశస్తి కూడా కలదు. తన తండ్రియగు పరీక్షిన్మహారాజు, సర్పదష్టుడై మరణించెనని తెలిసికొని, జనమేజయుడు, సర్పయాగము చేసెను. ఆ విధముగా అతడు సర్పసంతతిపై పగ తీర్చుకొనెను – కాని దాని మూలమున, జనమేజయునకు కుష్ఠు రోగము వచ్చి, అది భయంకర రూపముతో, వానిని

బాధించుచుండెను. అనేక విధములుగా ఈ వ్యాధి నివారణమునకై జనమేజయుడు ప్రయత్నములు చేసెను. ఫలితము లేకపోయినది – అపుడు, దత్తాత్రేయుడు జనమేజయునితో గురువాయురప్పన్ (శ్రీకృష్ణ) దైవమును సేవించిన రోగవిముక్తి కలుగునని చెప్పెను. ఆ ప్రకారము, జనమేజయుడు ఆ ఆలయమును సందర్శించి దైవమును సేవించి, నాలుగు నెలల కాలము తపము చేసెను. దానితో ఆతనికి రోగవిముక్తి కలిగినది!

సుమారు 500 యేండ్ల క్రిందట పాండ్యమహారాజు ఈ దేవుని సేవించి తన ప్రాణములను కాపాడుకొనిన విషయము ప్రచారములోనున్నది. ఈ సంఘటనము మిక్కిలి ఆసక్తిదాయకమైనది! శ్రీకృష్ణ విగ్రహము యొక్క శక్తిని వివరించుటయే కాక ఇది భక్తులకు ఆనందమును కలిగించును.

విగ్రహము ప్రతిష్ఠ జరిగిన చాలా సంవత్సరముల తరువాత, పాండ్యరాజు రక్షణ పొందెను. అది ఈ విధముగా జరిగినది. ఆరాజు, జాతకము ప్రకారము పాముకాటు వలన మృతి చెందునని, ఒక గొప్ప జ్యోతిష్కుడు తెలిపెను. ఆ మాట విని, భయపడిన ఆ రాజు, ముందురోజున గురువాయూర్ ఆలయమునకు పోయి, ఒక పగలు, ఒక రాత్రి భక్తితో గురువాయురప్పన్ ధ్యానమున ముని తన్మయుడైయుండెను. తెల్లవారినది. జ్యోతిష్కుడు చెప్పిన రోజు దాటిపోయినది. ఇక తనకు మరణము లేదనుకొని, తన సౌధమునకు వచ్చి, జ్యోతిష్కుని రావించి అతనితో ఇట్లు అనెను : "దైవజ్ఞులైన మీరు, నా జాతకము ప్రకారము నాకు పాముకాటు వలన నిన్న మరణము సంభవించునని తెలిపిరి. కాని, అట్లు జరుగలేదు! దీనివలన జ్యోతిష్యము చెప్పుటలో మీరు పొరపడితిరి కదా!"

జ్యోతిష్కుడు తన రెండు చేతులను జోడించి రాజునకు నమస్కరించి "ప్రభూ! నేను చెప్పిన దానిలో పొరపాటు లేదని నామనవి. తమ ఎడమ పాదమును, నిన్ననే ఒక విషనాగు కాటు వేసినది! కాని మీరు శ్రీ కృష్ణ ధ్యానములో భక్తి తత్పరులైయుండుట చేతను, దైవము మీ ప్రార్థనను అంగీకరించుటచేతను, మరణము సంభవింపలేదు. మీరు, ఎడమ కాలిని చూడుడు! అచట నాగుపాము కాటువలన, చర్మము నల్లబడియుండును!" రాజు ఆశ్చర్యముతో చూడగా, అట్లే ఉండెను. రాజు జ్యోతిష్కుని తగిన విధముగా సత్కరించెను!

ఈ పవిత్ర దేవాలయమున, ఉదయము 3 గంటల నుండి రాత్రి 10 గంటల వరకు ధర్మదర్శనముతోపాటు ఆర్జిత సేవలు జరుగుచున్నవి. పలువిధములైన ప్రసాద వితరణము ఏర్పాటు చేయబడినది. విగ్రహము సన్నిధిలో ఆలయము ఆదాయవ్యయములు, నివేదింపబడును. ప్రత్యేకమైన దీపాలంకరణ వేళలందు, ఆలయము మూసివేయబడును. పూజలు, అభిషేకములు, నీరాజనములతో ఆలయము భక్తులకు ఆనందమందించుచు, వారికి ముక్తి మార్గమును చూపుచున్నది. ప్రత్యేక దినములలో శ్రీకృష్ణునికి సంబంధించిన నృత్యనాటకము ప్రదర్శింపబడును.

# శ్రీ పద్మనాభస్వామి వారి దేవాలయము

## (ఫోర్టు : తిరువనంతపురము, కేరళ)

కేరళ రాష్ట్ర ముఖ్యపట్టణమైన, తిరువనంతపురమున, కోట (Fort) లో గల ఈ దేవాలయము ''అనంతశయనము'' అను పేరున, ప్రాచీనకాలమునుండి, ప్రశస్తి వహించినది. ఈ సువిశాలమైన, పవిత్రమైన, ఈ ఆలయమునందు శ్రీ పద్మనాభస్వామివారి విగ్రహము, ఎప్పుడు, ఎవరిచేత, ప్రతిష్ఠితమైనదీ, తెలిసికొనుటకు తగిన ఆధారములు కాని, చారిత్రిక విషయములు కాని, లభించుట లేదు !

కాని, పరిశోధక విద్వాంసులు, రచయితలు, చరిత్రకారులు మొదలైన వారి అభిప్రాయము ప్రకారము, ఈ దేవాలయ నిర్మాణము, కలియుగ ప్రారంభదినమున, అనగా 5వేల సంవత్సరముల క్రితమే జరిగినది ! ఇదే అభిప్రాయమును డా॥ ఎల్.ఎ. రవివర్మ వెల్లడించిరి. వీరు తిరువాన్కూరుకు చెందినవారు.

ఈ ఆలయమునకు సంబంధించిన ఐతిహ్యములు, పురాణగాథలు – వీనిననుసరించి దీని నిర్మాణము పురాతన కాలమునందు జరిగినది.

ఈ సందర్భమున ''అనంతశయన మాహాత్మ్యము'' అను గ్రంథమునందు గల విషయము తెలిసికొందము తుళు బ్రాహ్మణుడైన 'దివాకరముని' పుంగవుడు, కలియుగమునందలి 950వ రోజున, ఈ ఆలయమును నెలకొల్పెను ! ఆలయమునందలి తాళపత్రములందును, ఈ విషయము చెప్పబడినది.

అది ఎట్లనగా, గొప్ప విష్ణుభక్తుడైన దివాకరముని, తపము చేయుచు, ఒక దశలో మహావిష్ణువును సాక్షాత్కరింపచేసికొనెను – అయితే, విష్ణువు రెండేండ్ల వయసు గల బాలునిగా దర్శనమిచ్చి, తానెవరు అయినదీ, ఆమునికి తెలుపలేదు. కాని, ఆ బాలుని పట్ల అనురాగమును పెంచుకొని, అతడిని తనవద్దనే ఉండవలెనని కోరెను.

బాలుడంగీకరించి, ఒక నియమము విధించెను. తనను ఎల్లప్పుడును ఒకేవిధమగు ప్రేమానురాగములతో చూడవలెను. అట్లు చేయనిచో తాను మునిని విడిచి వెళ్లిపోయెదనని తెలిపెను. ఆ ముని దానికి అంగీకరించుటతో,

బాలుడతనితో నుండెను.

ముని ఆ బాలుని పట్ల అనురాగమును కలిగి, అతడి మాటలను విని చేష్టలను చూచి, ఆనందింపసాగెను. కాని ఒక రోజున, ఆముని ధ్యానముద్రలో నుండగా, అచటగల ''సాలగ్రామమును'' తీసికొని, దానిని నోట్లో వేసికొని, గంతులిడుచుండెను.

ప్రతిదినము, తాను పూజించుచున్న సాలగ్రామము అపవిత్రమైనందులకు ఆ మునికి పట్టరాని ఆగ్రహము కలిగెను. అతడు, ఆ బాలుని మందలించెను – తాను విధించిన నియమమును, అతిక్రమించిన, ఆముని చూచుచుండగనే, బాలుడు పారిపోయి, అంతర్ధానమయ్యెను !

కొంతసేపటికి ఆ బాలుడు మునితో ''నన్ను చూడదలచినచో అనంతమునకు రమ్ము'' అని తెలుపుట వలన ఆ బాలుడు ఎవరైనది, ముని గ్రహించి, తాను చేసిన తప్పిదమునకు మిక్కిలి చింతించెను. అయినను, నిరాశ చెందక, ఆ ముని బాలుడు వెడలిన దిశలో పోవుచు వానిని వెదుకసాగెను. చాలాదినములు, ఆ ముని నిద్రాహారములు మాని, ఆ ప్రయత్నములోనుండగా, అతడికి సముద్ర తీరమున, దట్టముగా ఉన్న చెట్ల నడుమ ఆ బాలుడగుపించెను! ఆ బాలుడు, దగ్గరిలోనున్న చెట్టుతొఱ్ఱలోదూరెను, అంతట ఆ చెట్టు క్రిందపడి, అందుండి ఒక మహావిష్ణువు ఆకృతి వెలువడెను.

విచిత్రమేమనగా, ఆ దివ్యవిగ్రహము యొక్క తల కోటకు మూడు మైళ్ల దూరమునందున్న తిరువల్లం వద్దను, పాదద్వయము, దానికి ఎదురుగా 5 మైళ్ల దూరమునందున్న త్రిప్పపూర్ అను ప్రదేశము వద్దను ఉండుటచూచి, ఆ ముని ఆశ్చర్యపడుచుండగా, అతనిలో భక్తి అధికమైనది. అంతటి పెద్ద విగ్రహము ఎదుట నిలబడి, ముని మహావిష్ణువును తన దృష్టికి సరిపడునంత పరిమాణమున దర్శనమీయవలెనని ప్రార్థించెను.

అపుడు, ఆ సన్యాసి (ముని) యోగదండమునకు, మూడురెట్లు పొడవుగల విగ్రహముగా మారెను. ఆ విధముగా, విగ్రహము ముని పూజలనందుకొని, తుళు బ్రాహ్మణులచేత, తనకు పూజాదికములు చేయించవలసినదిగా ఆదేశించెను! ఆ ప్రకారమే ఈనాటికిని ఆలయ పూజారులలో సగము మంది తుళు బ్రాహ్మణులే.

మరియొక గాథ కూడా విశేషముగు ప్రచారములోనున్నది. దీనిని చాలమంది ఆమోదించిరి. బిల్వమంగళత్తుస్వామి అనబడు సన్యాసి, దక్షిణ దేశములోని అనేక దేవాలయములతో సంబంధము కలిగియుండెను. అతడు నంబూద్రి బ్రాహ్మణుడు, గొప్ప విష్ణుభక్తుడు, దివాకరముని విషయమున విగ్రహము ఆవిర్భవించినట్లే, ఈ సన్యాసి విషయమున జరిగినది.

ఒకనాడు, శ్రీ మహావిష్ణువు, అనంతశయన రూపములో, ఆ సన్యాసికి దర్శనమిచ్చెను. కాని, ఆ దేవునకు నివేదించుటకు, అతడి వద్ద ఏమియు లేకపోయెను ! అతడు, దగ్గరలో నున్న మామిడి చెట్టునుండి కొన్ని కాయలు కోసి, వానిని కొబ్బరి చిప్పయందుంచి, భక్తితో నివేదనము చేసెను. ఈనాటికిని, మనము ఆ దేవాలయమున, నైవేద్యమునకు వినియోగింపబడుచున్న కొబ్బరి చిప్ప ఆకారములో ఉన్న ఒక బంగారు గిన్నెను చూడవచ్చును.

నమ్మాళ్వార్ కీర్తనల ప్రకారము, ఈ ఆలయము 5వ శతాబ్దిలో నిర్మాణమైనట్లు ఖచ్చితముగా చెప్పనగును. ''ఎత్తార్ యోగమ్'' అను రికార్డులననుసరించి, ఈ ఆలయ నిర్వహణము, ఒక స్థానిక కమిటీ సభ్యులచే జరిగినట్లుగ తెలియుచున్నది. ఇది కాక, తాళపత్రములను బట్టి కూడా, ఈ ఆలయమునకు ''చెరుమాన్‌పెరుమాల్'' (Cheraman Perumal) అను సాధువు (ఇతడు పాలకుడు కూడ) చే, తొలిసారిగా పునాది వేయబడినదని తెలియుచున్నది ! ఆలయ వ్యవహార నిర్వహణమునకు, పూజాదికములు జరుపుటకు మరియు వేరు వేరు పనులు చేయుటకు ఆ సాధువు కొంతమందికి బాధ్యతలనప్పగించెను.

చాల సంవత్సరముల తరువాత, అనగా 11వ శతాబ్ది మధ్యలో, ఈ ఆలయము యొక్క పునర్నిర్మాణము జరిగినది, నిర్వహణ కమిటీ మరల యేర్పడినది, అట్టి కమిటీయే, నేటికి పనిచేయుచున్నదని తెలియుచున్నది.

మరియొక ఆధారము ప్రకారము 14వ శతాబ్దిలో ఆనాటి తిరువాన్కూరు రాజైన వీరమార్తాండ వర్మ, క్రమక్రమముగా, ఈ ఆలయ బాధ్యతలను చేపట్టి, తన సామర్థ్యముతో, దానిని అభివృద్ధి చేసెను. 1375లో అతి ముఖ్యమైన ''అల్పాసీ ఉత్సవము'' (Alpasi Utsavam) ను 10 రోజులు నిర్వహించెను.

వీర మార్తాండవర్మ అనంతరము, ఈ ఆలయమున కొన్ని మార్పులు,

చేర్పులు జరిగినవి. అవి, దేవాలయము గర్భగుడిని పునర్నిర్మించుటకై శ్రీ పద్మనాభస్వామివారి విగ్రహమును, 1460 ప్రాంతమున ''బాలాలయము''నకు (Balalaya) తరలింపబడినది.

తరువాతి సంవత్సరములో, ఒకే ఒక పెద్ద గ్రానైట్ పైకప్పు (Roof) ను ఏర్పరచి, విగ్రహమును అచ్చట ప్రతిష్ఠ చేసిరి. అటు పిమ్మట గోపుర నిర్మాణమునకు పునాది వేయబడినది. అయితే, అతి భయంకరమైన అగ్నిప్రమాదము జరిగి, ఒక్క ప్రధాన దైవ విగ్రహము తప్ప, తక్కినది అనగా ఆలయము పూర్తిగా దగ్ధమైపోయినది! అందువలన 18వ శతాబ్ది ప్రారంభమున సంప్రోక్షణ జరుపబడినది.

కాలగమనములో, సామాజిక, ఆర్థిక పరిస్థితుల ప్రభావము వలన ఎన్నియో మార్పులు జరిగినవి. ఆలయ సంప్రదాయములు, పూజాదికమగు ఆచారములు, ఉత్సవములు, మొదలగునవి పూర్తిగా ఆగమశాస్త్రమునందు నిర్దేశించిన పద్ధతిలో జరుగుచున్నవి!

ఈ ఆలయమును సందర్శించువారు, తప్పక, కొన్నివిధులను, నిషేధములను పాటింపవలెను. మరియు దైవదర్శనము రోజులో కొన్ని నియమిత సమయములందు చేసికొనవలెను. ముఖ్యముగా, పురుషులు, బాలురే అయినను (ధోతీ) పంచెను ధరించి, వీలయిన అంగవస్త్రము (గాపంచా) ధరింపవలెను. అట్లే మహిళలు, చీరలు, జాకెట్లు ధరింపవలెను.

12 ఏండ్లలోపు వయసు గల బాలికలు గౌనులు ధరింపవచ్చును. ఈ విధమైన వస్త్రధారణ లేనిచో, వారిని దేవాలయములోనికి ప్రవేశించుటకు అనుమతింపరు. అవసరమనిపించినచో, మగవారు అంగవస్త్రమును తమ నడుమునకు చుట్టుకొని దైవదర్శనము చేసికొనవచ్చును.

ఈ విశాలమైన చారిత్రిక ప్రాముఖ్యము గల ఆలయము ప్రాంగణములో, శ్రీ నరసింహమూర్తి, శ్రీ కృష్ణుడు, శ్రీరామస్వామి, శ్రీ శాస్త, ప్రభుహనుమాన్ మరియు అగ్రశాల గణపతి మందిరములు కలవు.

తిరువనంతపురము, తూర్పుకోట (East Fort) వద్ద గల బస్‌స్టేషనుకు సమీపమునందు ఈ ఆలయమున్నది. ఇది నగరమునందు, అతి ముఖ్యమైన

ఆరాధనా మందిరము. ఈ ఆలయ నిర్మాణము పూర్తిగా ద్రావిడ శిల్ప పద్ధతిలో జరిగినది ! దాక్షిణాత్య భారతీయ శిల్పము గల ఈ ఆలయము భక్తులకు, భాగవతులకు మాత్రమే పరిమితము కాక, పర్యాటకులను ఆకర్షించుచున్నది !

గర్భగుడిలో, మనవు, శయనించిన శ్రీమహావిష్ణుదేవుని భారీ విగ్రహమును దర్శింపవచ్చును. అనంతుడు అను సర్పముపై నిదురించునట్టి శ్రీ మహావిష్ణువే పద్మనాభస్వామివారు. వారి నాభికమలమునుండి బ్రహ్మదేవుడు జన్మించెను.

శ్రీ కేశవ నామములలో (24) ''శ్రీపద్మనాభ'' నామము కలదు. ప్రక్కన గల, పుష్కరిణిలో, ఈ ఆలయవు ప్రతిబింబవు చూచుట కనుల పండువుగానుండును. ఈ ఆలయమునందు సప్తప్రాకారములు (Seven Storeys) కలవు.

# శ్రీ అవధూత దత్త పీఠము

## (మైసూరు, కర్ణాటక)

చందన పరిమళ శోభితమై, చల్లదనమును, ప్రశాంతతను కలిగి ఉన్న మైసూరు నగరమునకు సుమారు ౭ కి॥ మీ॥ దూరమున గల శ్రీ అవధూత దత్త పీఠము, చూపరులను ఆకర్షించి, భక్తులను ఆకట్టుకొనగల, దివ్యసుందర మందిరము అనదగిన దత్తపీఠము కలదు.

''ప్రశాంతత సామ్రాజ్యమునేలిన చోటు ఇది'' ("Where peace reigns supreme") ఎందుచేతననగా ఇది శ్రీ దత్తాత్రేయ విభుని ఆవాసము. అందుచే దీనిని దత్తపీఠమనుచున్నారు.

శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద అవధూత దత్తపీఠము, ప్రశాంత ప్రదేశములో పాదుకొని ఉండుటయే కాక, సామాజిక, నైతిక, అధ్యాత్మికపరమైన శ్రేయమును చేకూర్చుటలో, ఈ పీఠమునకు, అంతర్జాతీయముగను ప్రఖ్యాతి కలదు. ఈ ప్రదేశములోనికి ప్రవేశము చేసిన వారికి, వేదమంత్రములతో కూడిన నాదము వలన ఒక దివ్యమైన అనుభూతి కలుగుననుటలో సందియము లేదు.

ఉన్నతమైన, అందమైన శిల్పముతోనున్న, విశాలమగు హనుమద్వారము, ఆకర్షణీయమై ఆహ్వానించుచున్నట్లు కనుపించును. మందిరములోపలి భాగములో, బాల దత్తాత్రేయ ప్రభువు చిన్న విగ్రహము, కాననగును. తరువాత, అర్ధనారీశ్వర, గణేష్ విగ్రహములున్నవి. సమీపమున నుండి, మీకు కనుపించకుండగనే శ్రావ్యమైన వేదమంత్రోచ్చారణము వినుపించుచుండును. ఈ కార్యక్రమము, సమర్థులైన, గురువర్యుల అధ్వర్యమున యువకులచే నిర్వహింపబడుటచే, అపశ్రుతులుండవు.

వేదవిజ్ఞాన అభివృద్ధి, వేదాధ్యయనము మరియు సంస్కృత భాషావ్యాప్తి చేయుట, అందులకై నిర్ణీతమైన కాలపరిమితి యేర్పరచుట, ఈ పీఠము యొక్క ముఖ్యమైన ఆశయములు. వేదవిజ్ఞానమును పునరుద్ధరించి, దానిని సమగ్రముగా పరిరక్షణ చేయుటకు ఈ పీఠము మిక్కిలి కృషి చేయుచున్నది. ఇది ముదావహమగువిషయము !

అధ్యాత్మికమైన అభ్యున్నతిని సాధించుటకు అనుపుగా ఇచట అనేకాశములు

చాలా కలవు. శ్రీ దత్తాత్రేయ ప్రభువు ఈ పీఠమునకు ప్రధాన దైవము; ఈ ప్రభువు సద్గురువునకు ప్రతినిధి. అంధకారమునుండి వెలుగులోనికి కొనిపోయి శిష్యులకు ఆవశ్యకమైన, ఆచరణీయమైన బోధన, సాధనల ద్వారా మోక్షమార్గమునుపదేశించు సమర్థ సద్గురు దేవుడు శ్రీదత్తాత్రేయుడు !

ఆశ్రమమున ప్రవేశించినవారికి ప్రశాంతమైన నిర్మలమైన అచటి వాతావరణము హాయిని కల్గించును. శ్రీ దత్త ప్రభువుల వారి దివ్య సందేశమును, వారు నిర్దేశించిన విధానమును, వెలయించుచున్న శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీవారు, ఈ దత్తపీఠమునకు అధిపతులు. వారు ఆత్మజ్ఞానము పొందిన మహనీయులు !

విషయ విస్తరణము కాకుండా, సంగ్రహముగా కొన్నింటిని గూర్చి, వివరణము దిగువనీయబడినది. ఇచట, వసిష్ఠ కార్యాలయమునందు, పాలనావిభాగము (Administrative Office) కలదు. ఇది, దత్తపీఠమునకు సంబంధించిన సమాచారమును అందచేయు కేంద్రము. దీనికి దగ్గరలో సుమేరు ధ్యానమంటపము కలదు. ఇది, ఒక అసాధారణమైన నిర్మాణము – కేవలము ధ్యానమునకే ఈ మంటపము ఉద్దిష్టమై యున్నది. ప్రవేశించిన వెంటనే భక్తులకు, పర్యాటకులకు, మానసిక నిశ్చలత్వమును ప్రశాంతతను ఇది చేకూర్చుచున్నది.

ఇచట సామాజిక ప్రయోజనములను సాధించుటకు, దత్తపీఠము యొక్క ఆశయములు వెల్లడించుటకు శ్రీ గణపతి సచ్చిదానంద విద్యాసంస్థకు అనుబంధముగా విద్యాలయములు కలవు. మరియు కొన్ని వైద్య కేంద్రములు సేవలనందించుచున్నవి. ఈ కేంద్రములు మనదేశమున వివిధ కేంద్రములలో పనిచేయుచున్నవి. కంటిజాగ్రత్తలు, దేహారోగ్యము కాపాడుకొను విధము పరిశోధనము వంటి విషయములలో ఈ కేంద్రములు, అవగాహన కల్పించుటలో నిత్యము నిమగ్నమై యుండుట ప్రశంసనీయము. మరియు అన్నదాన కేంద్రము ద్వారా ఉచిత భోజనము కలదు. శ్రీ జయలక్ష్మి మాతా అన్నదాన సంస్థ దీనిని నిర్వహించుచున్నది.

పూజ్యశ్రీ స్వామీజీ సామాజికముగా పేదలకు సాయము చేయుట ప్రజల నైతిక బాధ్యత అని గుర్తుచేయుచున్నారు. అందులకై ఇచట 'దాన శిబిరము' (Charity Clinic) ఏర్పాటుచేయబడినది.

The Universal Prayer Hall లో ఒక విశాలమగు, ప్రశాంతత గల ప్రార్థనా మందిరము నందు శ్రీ స్వామివారి సన్నిధిని, సామూహికమగు ప్రార్థనలు, భక్తి ప్రపత్తులతో జరుగుచున్నవి. ఇచటనే అధ్యాత్మికమైన కార్యకలాపములు సాగుచున్నవి. ఈవిధమైన కార్యక్రమములు, సంవత్సరము పొడుగునా నిర్వహింపబడుచున్నవి. ఈ ప్రార్థనా మందిరమునకు, పశ్చిమ దిశయందు గర్భాలయము కలదు. అతిముఖ్యమైన శ్రీ చక్రపూజ ''శ్రీ చక్రము మేరు'' వద్ద జరుగును. ఈ శ్రీ చక్రము మేరు ఉన్నతమైన ప్రత్యేకమైన మంటపము వద్ద జరుగును. ఇది ఒక ప్రధానమైన పూజా పీఠము. వేలకొలది భక్తులు, ఆస్తికులు, భాగవతులు ఇందు పాల్గొనుచుందురు. ఈ కార్యక్రమము చూచి, అనుభూతి పొందుట ఒక మహత్తరమైన విషయము.

''జయగురుదత్త, శ్రీగురుదత్త'' అను దివ్యనామముల ఉచ్చారణతో, ఒకరిని ఒకరు పల్కరించుకొందురు. భక్తులు, నిశ్శబ్దముగా వచ్చి, ప్రశాంతముగా కూర్చుని, శ్రీ దత్తాత్రేయ దైవధ్యానము చేయుచుందురు. ప్రార్థనా మందిరమునకు ఎడమవైపునగల, దత్త దేవుని మందిరమున కొందరు పూజలు చేయుచుందురు.

ఈ పరిసరములన్నియు చూచుటకు కనులపండువుగానున్నవి. బాధాతప్తమైన వారి మనములకు కావలసిన చికిత్స వంటిది దత్తపీఠము-ద్వారా లభించుచున్నది. ఎందరో వివిధ ప్రదేశముల నుండి ఇచటకు వచ్చి, అట్టి చికిత్స ద్వారా స్వస్థత పొందుచున్నారు.

ఆకర్షణీయమైన సందర్శింపదగిన (మట్టితో చేయబడిన) మూలికేశ్వర విగ్రహము పీఠము ముందు భాగమున కలదు. ఇది ప్రపంచములో, మిక్కిలి పెద్దదైన విగ్రహములలో ఒకటి! ఈ పరిసరములలో, చికిత్సకు అవసరమగు మూలికలు, వ్రేళ్లు, మొక్కలు లభించును.

ప్రధానమందిరమునకు ఉత్తరదిశలో ''అకాల మృత్యు మోక్షస్థూపము'' కలదు. బంధవిముక్తిని కోరు ఆత్మలకు ఇది సంకేతము! ప్రార్థన ఆలయము కుడిభాగమున లక్ష్మీ నరసింహ సముదాయము (Complex) కలదు. ఇచట, విభిన్న దైవతములు, అనగా విఘ్నరాజు, లక్ష్మీనరసింహము, విశ్వేశ్వర, విశాలాక్షి విగ్రహములు, నవగ్రహములు ప్రతిష్ఠితములైనవి.

ప్రధానముగా పేర్కొనదగినవి :- వేద పాఠశాల నాద మంటపమున గల (రాగరాగిణి సముదాయభవన్) సప్త స్వర దేవతలు, 60 అడుగుల ఎత్తుగల ధర్మధ్వజము, శ్రీ వేంకటేశ్వర ఆగమ విద్యాకేంద్రము, శ్రీ వేంకటేశ్వరాలయము అనునవి. శ్రీ వేంకటేశ్వరస్వామివారి విగ్రహము శ్రీస్వామీజీగారికి బందరు వద్ద (Machilipatnam) లభించినది. ఇంతటి విశిష్టత గల, ఈ సద్గురు దత్తపీఠమును ప్రతి ఒక్కరును సందర్శించవలసినదని నా అభిప్రాయము.

తే 22-7-2000 ది, స్థిరవారమునాడు, మా రెండవకుమారుడైన చిరంజీవి సత్యవేంకటరావు మాకు తోడు రాగా, దంపతులము ఈ పవిత్ర మందిరములను, దత్తపీఠమును సందర్శించుకొను భాగ్యము కలిగినది !

ఆహ్లాదకరమైన చల్లని వాతావరణము తోడను, అధ్యాత్మిక చింతనము కలిగించు పరిసర ప్రదేశముల తోడను, అచట గల పెంపుడు జంతువులతోడను, పచ్చదనముతోడను, వినిర్మలమైన ప్రశాంతత తోడను, అలరారుచున్న శ్రీ అవధూత దత్తపీఠమును సందర్శించినపుడు నేను పులకరించితిని. ఒకవిధమైన, దివ్యమైన, అనుభవైకవేద్యమైన, అనుభూతికి లోనయి అత్యంతమూ అనందపారవశ్యమునకు లోనయి, శ్రీ దత్త దేవులవారిని నాకనుల ముందు సాక్షాత్కరింపజేసికొని అనిర్వచనీయమగు ఆనందమున తన్మయుడనైతిని !

ఇటువంటి ఉత్తమ దివ్యక్షేత్ర సందర్శనభాగ్యము, మా దంపతులకు, పురాకృత సుకృతముచే కలిగినదనుకొనుచు, శ్రీ దత్త స్వామివారిపై (అక్షర) పద్యరూపమున నీ విధముగా నా ఆనందము వెల్లడించుకొంటిని !

ఉ॥ శ్రీ గురుదత్త పీఠమును, చిత్తము తన్మయమందజూచితిన్ ।
సాగరతీరమందుగల శాంతిని గాంచితి, మెంతయేనియున్ ॥
శ్రీగల దివ్యజీవనవిశేషము కూర్చెడి దత్తదేవుడే
యీగతి తెచ్చి, సంతసము నిచ్చెను, మామనముల్లసిల్లగన్ ॥

# శ్రీ శుచీంద్ర దేవాలయము

## (కేరళ)

యావద్భారత దేశమందు, వివిధ రాష్ట్రములలో వెలసిన అనేకానేక దేవాలయములు, మందిరములు, మఠములు, పీఠములు, ఆశ్రమములు మొదలైన వానిలో, మనకు విలక్షణమైన, భిన్నత్వములో ఏకత్వము (Unity in diversity) గోచరించుచుండును.

ఈ దృష్టితో చూచునపుడు, శుచీంద్ర దేవాలయమునకు గల ప్రత్యేకత ఏమనగా, పేరుకు తగినట్లుగా, ఇచట పాతివ్రత్యము యొక్క విశిష్టతను తెలుపు ఐతిహ్యము కలదు.

ఈనాడు దర్శనీయమై సంసేవ్యమై ఉన్న పవిత్ర దేవాలయము, ఒకనాడు మహారణ్యము ! దట్టమైన చెట్లు మూలమున ఏర్పడిన చీకటి వలన, పట్టపగలు కూడా సూర్యరశ్మి సోకకుండెడిది ! ఇట్టి భయావహమైన ప్రదేశమునందు, సువాసన గల పూలతో, పక్షుల కిలకిలలతో అందమైన ప్రదేశమున్నది. ఉషాదేవి, ఈ ప్రదేశమును చూచి, ఆకర్షింపబడి తన రథముపై, ఒక మహర్షిని సందర్శించుటకు బయలు దేరినది.

అది అత్రిమహాముని ఆశ్రమము – పాతివ్రత్యమునకు సంకేతమైన ఆ మహనీయుని భార్య అనసూయతో, అతడు ఈ అరణ్యమున నుండి, తపము చేసికొనుచుండెను. అచటవారికి ధ్యానము ప్రధానము ! వారిరువురును సత్యమే జయించుననియు, ప్రేమయే దైవమనియు మరియు భార్యకు భర్తయే దైవమనియు నమ్మియుండిరి.

పతిసేవలో నిమగ్నురాలైన అనసూయ ప్రతి ఉదయమును ఆకాశగంగలో తాను స్నానము చేసి, ఒక మట్టికుండతో గంగాజలమును కొనివచ్చి, మిక్కిలి భక్తితో భర్తకు పరిచర్యలు చేయుచుండెను. ఈ ప్రదేశము, ఇప్పటికిని ఆ అరణ్యము పశ్చిమభాగమున, ''ఆశ్రమము'' గా వ్యవహారములోనున్నది.

వారిరువురు ఇట్లు కాలము గడుపుచుండగా వర్షములు లేకపోవుటచే, అత్రి మహాముని విచారగ్రస్తుడై, దీని విషయమై తాను ఒక యాగము చేయుటకు నిశ్చయించెను. బ్రహ్మ ప్రత్యక్షము కాగా, వర్షములు లేకపోవుటకు గల కారణము

తెలుపవలెనని అత్రి మహాముని కోరెను – బ్రహ్మ తనకు ఆ విషయము తెలియదని పలుకగా, అత్రి మహాముని విష్ణుదేవుని ధ్యానించెను. విష్ణువు కూడా కారణము తెలియదని అత్రిమహామునికి చెప్పెను. అపుడు, అత్రి మహాముని త్రిమూర్తులను ధ్యానింపగా ఆ ముగ్గురును ప్రత్యక్షమైరి. వారిద్వారా ఈ పరిస్థితికి దేవేంద్రుడు కారణమై ఉండునని చెప్పిరి. గౌతమ ముని శాపమువలన కోపగించుకొనిన, దేవేంద్రుని ప్రసన్నము చేసికొనుటకై, అత్రి హిమాలయములకు పోయి, తపము చేసెను!

అపుడు, అగ్ని దేవుడు ప్రత్యక్షమయ్యెను. ఇంద్రుడు తనకు కలిగిన అవమానము (సహస్రయోని!) చే ప్రత్యక్షము కాలేదు. త్రిమూర్తులు కూడా అత్రియాగమును నిలిపి వేయుటకు నారదుని సహాయము కోరిరి.

అపుడు అనసూయాదేవి ఉన్న ''జ్ఞానారణ్యము'' నకు, నారదుడు కొంతమంది ఋషులతో వచ్చెను. పతివ్రతయగు అనసూయ వారి రాకకు కారణమడిగి, వారి కోరికపై, వారు తెచ్చిన ఇనుప గుగ్గిళ్లను, తన పాతివ్రత్య మహిమచే శెనగలుగా మార్చి ఇచ్చెను!

అంతకు ముందు నారదుడు, త్రిమూర్తుల భార్యల వద్దకు పోయి, వారికి ఇనుప గుగ్గిళ్లను ఇచ్చి వేయించవలసినదిగా ప్రార్థించెను. అందులకు వారు నారదునితో అవి ఇనువగుగ్గిళ్లు, కావున వేయించుట సాధ్యము కాదని పలికి, అతనిని మందలించిరి! అనసూయ చేసిన పనికి త్రిమూర్తుల భార్యలు అసూయ చెందిరి. ఇది ఒక గాథ.

అట్లే, త్రిమూర్తులు, తమ భార్యల వత్తిడిపై అనసూయ వద్దకు వచ్చి, తమకు ఆకలిగా నున్నదనియు, ఆమె వివస్త్రయై తమకు ఆహారము పెట్టవలెనని కోరగా ఆమె వారిని పసిపిల్లలగా మార్చినది! మరల వారి భార్యలు వచ్చి, ప్రాధేయ పడిన మీదట వారిని త్రిమూర్తులుగా మార్చినది. ఇదియును ప్రచారములో నున్నగాథ!

ఈ ఆలయము విశిష్టత ఏమనగా, ''అహల్యాజారుడైన'' ఇంద్రుడు గౌతమ మహాముని శాప కారణమున సహస్ర యోనియై పవిత్రత కోల్పోయెను. దేవేంద్రుడు అవమానభారముతో తపించుచు, సిగ్గుపడుచుండగా, నారదుడు అతని వద్దకు వచ్చెను. ఇంద్రుడు తనకు కలిగిన దుస్థితిని తొలగించవలసినదిగా

నారదుని సహాయము కోరెను.

నారదుని సూచనమేరకు ఇంద్రుడు త్రిమూర్తుల నారాధించి, తనకు కలిగిన దుస్థితి తొలగించుకొనెను. అది ఇట్లు జరిగెను. ''ఐరావతము (ఏనుగు) తెచ్చిన జలములలో స్నానమాడి ఇంద్రుడు నందీశ్వరుని, విఘ్నేశ్వరుని పూజించెను. కులగురువు, బృహస్పతి సూచించిన ప్రకారము రావిచెట్టునకు పూజలు చేసెను. శివపంచాక్షరి మంత్ర జపము చేసెను. అచట బాగుగా మరిగించబడిన, నేతి పాత్రలో అతడు భక్తితో ఒకసారి మునిగెను ! ఆశ్చర్యము ! వేడి నేయి వలన ఇంద్రునకు హానికాని, బాధకాని లేదు.

ఆ విధముగా పవిత్రత కలిగించిన ఆలయము కావున, దీనికి శుచీంద్రము అనుపేరు రూఢియైనది. ఇచట, మూలస్థానమున ఒక లింగము కలదు. మరియు ఆనాడు ఇంద్రుడు భక్తితో నారాధించిన నంది మరియు విఘ్నేశ్వర విగ్రహములను, ఈ ఆలయమున చూడగలము.

ప్రచారములోనున్న విషయమేమనగా నేరము చేసినవారు ఇంద్రుడు వేడినేతిపాత్రలో మునిగి పరిశుద్ధుడైనట్లుగా, వేడి నేతిలో అనగా మఱుగుచున్న నేతిలో, తమచేతులుంచి పవిత్రులు అగుచుండిరట ! అయితే, 19వ శతాబ్ద మొదటి అర్ధభాగములో స్వాతి తిరునాళ్ రామవర్మ మహారాజు, ఈ ఆచారమును నిలుపు దలచేసెను.

ఈ ఆలయమును సందర్శించు భక్తులు, భాగవతులు, ఆస్తికులు, సుఖసంతోషములతో జీవనము గడుపగలరను విశ్వాసము, ప్రగాఢముగానున్నది. అట్టివారు ఇహపరములను, రెండింటిని పొందగలరు !

కొన్ని విషయములను తెలిసికొందము.

శ్రీ దేవీ భాగవతము నందలి, ఒకానొక శ్లోకము ప్రకారము, శక్తికిని, సౌందర్యమునకును సంకేతమైన నవరాత్రములకు చాలా ప్రశస్తి కలదు. వీనిని శరన్నవరాత్రములని యందురు. అనగా తొమ్మిది రాత్రుల ఉత్సవము – చాలా ప్రాంతములలో బొమ్మల కొలువు పెట్టి, ఆ విధముగా దేవ్యారాధనము చేయు ఆచారము ఈనాటికిని కలదు! బొమ్మల పండుగగా ఇది పిన్నలకు, పెద్దలకు, బాల బాలికలకు ఆస్తికులకు సన్నిహితమైనది.

మరియొక విశేషము – దసరాపండుగ సందర్భముగా ఆయుధపూజలు చేయుచుందురు. అందరు అమ్మవారిని కొలుచుచుందురు. అయ్యవారికి విద్యార్థులు, తల్లిదండ్రులు పప్పు బెల్లములతో పాటు పైకమును గురుదక్షిణగా ఇచ్చుచుందురు. కొందరు దసరావేషములు ధరించి, వినోదము కల్గించుచుందురు, మరికొందరు పందిళ్లలోగాని, వీధి అరుగులమీదగాని, ఆలయ ప్రాంగణములందుగాని, తుదకు విశాలమైన చెట్ల నీడలందు గాని, కూర్చొని హరికథలు, గిరికథలు చెప్పుట పరిపాటి. పురాణపఠనము జరుగుచుండెడిది. ఇవి అన్నియు ఒకనాటి మాట! ప్రస్తుతము, అటువంటి సన్నివేశములు అరుదుగా కనిపించుచున్నవి.

దసరాలలో, విజయదశమినాడు, కలిమి, చెలిమి, బలిమి అను మూడింటి మేలిమి విజయగాథలను, వీనులవిందుగా విని ఆనందించెడి వారి సంఖ్య అధికముగానుండును.

హనుమ లంకను కాల్చినది, అర్జునుడు విజయము పొందినది దశమి యగుటచే, ఆయుధ పూజకు ప్రతీకగా శక్తిపూజ జరుగుచున్నది.

ఈ నవరాత్రులలో ప్రతిదినము శ్రీదేవిని భక్తిప్రపత్తులతో పూజించు ఉపాసకులు, శక్తి స్వరూపిణియగు శ్రీ దుర్గకు హంశలుగా బాలికలను సత్కరించు ఆచారము కలదు.

కొంతమంది భక్తులు పృథ్వీశయనము చేయుదురు, సంకల్ప సహితముగా, పవిత్రమైన జలములలో నిండిన కలశము మీదకు, శ్రీ దుర్గాదేవిని ఆవాహనము చేసి, షోడ శోపచారములు చేయు ఆచారము కూడా కలదు. శ్రీ దుర్గాదేవి షోడశ భుజ – అవయవలోపము లేని బాలికలను తెచ్చి వారిని ఈ తొమ్మిది

రాత్రులందు పిండివంటకములతో భోజనము ఏర్పాటు చేసి, వస్త్రాభరణాదులతో సత్కరించుచుందురు. అట్లు తొమ్మిది రోజులు పూజ చేయుటకు అవకాశము లేనిచో కనీసము ఏడురోజుల (రాత్రుల) తరువాత పూజ చేయవచ్చును.

రుద్రరూపిణి, భద్రకాళిగా, ఏడవనాడు జన్మించిన చాముండేశ్వరి ఎనిమిదవ రోజున వీరవిహారము చేసి రాక్షస సంహారము చేసినది. పదియవ దినమున విజయలక్ష్మిగా, ఆనందోత్సవమునకు మూలమై అందరి పూజలనందు కొనుచున్నది ! అట్లే చివరి మూడు రోజులలోను, దుర్గాష్టమి, మహర్నవమి, విజయదశమి పేరిట, పూజాదికములు జరుగుచున్నవి.

స్వాభావికముగా స్త్రీ మంగళరూపిణి ! ఆకారణము చేత స్త్రీ ఎల్లప్పుడును గౌరవింపదగినదను భావము, కొన్ని ప్రాంతములందు కలదు. వివాహము వలన స్త్రీకి మాంగళ్యము లభించును. అట్లు ఆమె అయిదు వరాలు అగుచున్నది. అనగా అయిదు (ఐదు) వన్నెలు కలది; ఆమె జీవ భర్తృక సౌభాగ్యవతి, సుమంగలి యొక్క అయిదు అలంకారములు అనగా మంగళసూత్రము, పసుపు, కుంకుమ, గాజులు, చెవ్వాకు అనునవి ఆమె కలిగియున్నది. వివాహిత స్త్రీని, ఐదువ అనియు, ముత్తైదువ అనియు, వ్యవహరింతురు. ముత్తైదువ అనగా వృద్ధసువాసిని. అయితే, విగత భర్తృక అయిన స్త్రీని, ఆమె మాంగల్యమునకు, సౌభాగ్యమునకు, భంగము లేని విధముగా తమిళనాడు, కొన్ని ప్రాంతములందు వితంతువులను కూడా దేవీరూపముగా భావించి సత్కరించుట జరుగుచున్నది !

చారిత్రిక ప్రశస్తిని పొందిన విజయవాడలోని శ్రీ కనకదుర్గ అమ్మవారి ఆలయము అష్టాదశ శక్తిపీఠములలో ఒకటి. ఇది శ్రీ ఆదిశంకరాచార్యులవారిచే ప్రతిష్ఠితమైనది. విజయవాడ నగరము చుట్టును కొండలచే చుట్టబడి, సహజమైన ప్రకృతి సౌందర్యముతో అలరారుచున్నది. ప్రస్తుతము శ్రీ దుర్గాదేవి ఆలయము గల కొండ కృష్ణానదికి ఆవలి తట్టున గల సీతానగరము కొండ, పూర్వము ఒకే కొండగా నుండెను.

ఒకానొక గాథననుసరించి, కృష్ణానది కోరిక మేరకు, శ్రీ దుర్గామాత ఆదేశము ప్రకారము ఈ ఆలయము గల కొండ (ఇంద్ర కీలాద్రి) చీలిపోయి, నదీ ప్రవాహమునకు దారి ఇచ్చినది ! అనుదినము భక్తులు, ఆస్తికులు, శాక్తేయులు అధికసంఖ్యలో ఈ ఆలయమును సందర్శించి ధూపదీపనైవేదనాదులు సమర్పించి,

ఆ అమ్మవారి సేవలో పునీతులగుచున్నారు.

పవిత్రతకు చిహ్నమైన పసుపు దట్టముగా పూయబడిన శ్రీ కనకదుర్గాదేవి దివ్యవదనము తిలకముతో శోభాయమానమై, కనులపండువుగా కనిపించుచున్నది, తనను నిరంతరము భక్తితో సేవించువారికి ఆ తల్లి అభయ మిచ్చి కాపాడుచున్నది, వారికి శుభమంగళా శాసనములనంద చేయుచున్నది.

దేవతలు, ఋషులు, అర్చకులు శ్రీ దుర్గామాత సర్వాంతర్యామియను భావముతో ఆమెను స్తోత్రము చేయుచున్నారు. మార్కండేయ పురాణములో గల 'దుర్గా సప్తశతి' ఒక చక్కని స్తోత్రము!

ఆమె మహాదేవి, ప్రకృతి, భద్రాత్మిక, పార్వతి. ఆమె చైతన్యరూపిణి, సర్వభూతములందు ఆమె వివిధ రూపములతో నున్నది. ఆమె అమ్మల గన్న అమ్మ! జగదీశ్వరి, ఆమెయే జగజ్జననిగా ప్రసన్నురాలగుచు భక్తులైన వారి కోరికల నీడేర్చుచున్నది. ఇంద్రకీలుడను గంధర్వుని తపము చేత, శ్రీ దుర్గ అనుగ్రహమున పర్వత రూపము ధరించి నందున ఆ తల్లి జగముల పాలిటి తల్లిగా, కల్పవల్లిగా, బంగారు తల్లిగా వెలసినది!

# శ్రీ శ్యామలాంబ ఆలయము

## (కైకలూరు - కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్)

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, సారస్వతాభిమానులు, ఆధ్యాత్మిక సంపన్నులు, వితరణ శీలురు, దైవ భక్తులు, లబ్ధప్రతిష్ఠులు, తామ్రపత్ర గ్రహీతలునైన శ్రీ కంతేటి కాశీవిశ్వనాథం గారి ఆహ్వానమును పురస్కరించుకొని, నేను సతీ ద్వితీయుడనై, కైకలూరు చేరుకొంటిని. వారు, నేను రచించిన పద్యములను నాచే చదివింపించి, ఒక సభలో తమ విశాల గృహప్రాంగణమున యథోచితముగా మా దంపతులను ఘనముగా సత్కరించి, తాము తరించినట్లుగ ఎంతయు సంతసించిరి !

అచట గల దేవాలయములలో శ్రీ శ్యామలాంబ (దేవేరి) ఆలయము విశిష్టమైనదను విషయమును, అచటనున్న కవిమిత్రుల ద్వారా తెలిసికొని ఆలయమునకు పోయి, దేవిని (దేవేరిని) భక్తి పూర్వకముగ సేవించితిమి.

శ్యామ, శ్యామల అను పదములకు పార్వతి, దుర్గ అను అర్థములు కలవు - దుర్గ అనగా తన భక్తులను దుర్గతి నుండి ఉద్ధరించునది అని అర్థము - ఈ దుర్గాదేవి మన దేశములో పలు ప్రదేశములలో వేరువేరు నామ రూపములతో ఆరాధింపబడుచున్నది.

కైకలూరులో శ్రీ శ్యామలాంబ (దేవేరి) ఆలయముతో పాటుగ, శ్రీ రామలింగేశ్వర, రామేశ్వర, కనకలింగేశ్వర, దేవీ, దేవేరుల ఆలయములు సుమారు 3 శతాబ్దము క్రితము నాటివని తెలియుచున్నది. ఈ ప్రాంతమునకు చెందిన ఆస్తికులు తమకు కలిగిన సంతతికి శ్యామలాంబ, శ్యామలాదేవి, శ్యామలరావు, శ్యామలరాజు అను నామములను భక్తితో పెట్టుకొనుచున్నారు.

పైన తెలుపబడిన ఆలయములకు భూములు మాన్యములు కలవు - భూములు సారహీనమైనను, ప్రాంతము ముంపులకు గురియగుచున్నను, పదాన్యుల మూలమున నిత్యమును ధూపదీప నివేదనాదులు సాగుచుండుట విశేషము !

లోగడ, అష్టగ్రహ కూటమి సందర్భముగా, ఒక అవధూతవారి

అధ్వర్యమున జరిగిన శాంతి కార్యక్రమములలో భక్తులు విలువైన కానుకలను, నగలును, నగదును సమర్పించిరి. నాటినుండియు నవరాత్రులు, సప్తాహములు జరిగి పండిత సత్కారము, సభలు జరుగుచున్నవి.

కంచికామకోటి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ చంద్రమౌళీశ్వరస్వామివారు, శ్యామలాంబ అమ్మవారిని సేవించి, ఆ తల్లి మంత్ర దేవతయనియు, ఐశ్వర్య ప్రదాయిని అనియు పేర్కొనిరి। శృంగేరి పీఠాధిపతులైన శ్రీ భారతీ తీర్థస్వామి వారును అమ్మవారిని సేవించిరి. ప్రతి శుక్రవారమును భక్తులు, అధికసంఖ్యలో ఈ ఆలయమున పూజాదికములు చేయుచున్నారు.

వేదవిదులైన కురుగంటి వారు పరిమి వారు ఆలయ కార్యక్రమములందు భక్తితో పాల్గొనుచున్నారు - కామాక్షి అనునామె, ప్రతి శుక్రవారము అమ్మవారిపై పాటలు పాడుచుండెడిది. సుమారు శతాబ్దము క్రిందట ఆమె ''అమ్మా-బంగరుబొమ్మా'' అను చక్కని కీర్తనమును మృదంగ వాద్యములతో పాడుచుండెడిది. ఈ కీర్తనను (పాట), శ్రీ కంతేటి కాశీ విశ్వనాథంగారు తమ ''మానసానంద మంజరి'' అను చక్కని భగవత్ స్తోత్రరత్నాకరమున చేర్చి, ప్రతులను భక్తులకు ఉచితముగా నందజేసిరి।

కైకలూరు గ్రామస్థులు అమ్మవారిని ఊరేగించుచుండెడివారు - కుమ్మరులు విగ్రహమును మోసెడివారు.

కైకలూరు గ్రామము చిన్నది - కాని ఇక్కడ పైన చెప్పబడిన ఆలయములే కాక, శ్రీరామమందిరము, శ్రీ కన్యకాపరమేశ్వరి ఆలయము, శ్రీ త్రిపుర సుందరీదేవి, ఈశ్వర, నవగ్రహ, శ్రీ సత్యనారాయణస్వామివారి దేవాలయములు కలవు. అట్లే, శ్రీ రామాంజనేయులవారి గుడి, శ్రీ కాళికాలయము మరియు శ్రీ వీరబ్రహ్మముగారి ఆలయములు కలవు.

శ్రీ శ్యామలాదేవి ఆలయుము, తూర్పుగోదావరి జిల్లాకు చెందిన సామర్లకోటలోను ఉన్నది.



విశాఖ సారస్వత వేదిక సత్కారసభలో
సన్మానితులు శ్రీరామకృష్ణరావు,
ఆచార్యదివాకర్ల రామమూర్తిగారు
శ్రీ డి.వి. సుబ్బారావు, శ్రీ డి.సి.హెచ్.
తిరుపతిరాజాగారు




శ్రీ డి.వి. సుబ్బారావుగారి అధ్వర్యంలో
లయన్సు క్లబ్‌వారు శ్రీ రామకృష్ణరావు
దంపతులకు అభినందనం



శ్రీ నారాయణ గురు విగ్రహ ఆవిష్కార
సభలో ప్రసంగిస్తున్న శ్రీ రామకృష్ణరావు
తేది 15-8-2001




రోటరాక్టు క్లబ్‌వారు తనకు ఏర్పాటు చేసిన
సత్కారసభలో శ్రీరామకృష్ణరావు
ప్రసంగిస్తున్న దృశ్యం చిత్రంలో
శ్రీమతి టి. సరస్వతీదేవి, శ్రీ కనకారావు
సలాది ఉన్నారు.




'విశాఖపట్టణ దేవాలయములు'
గ్రంథావిష్కార సభలో ఎడమనుండి
కుడివైపుకి వరుసగా –
శ్రీ సి.యు.వి. కృష్ణమూర్తి, శ్రీ డి.వి.
సుబ్బారావు, డా॥ ఎమ్. గోపాలకృష్ణారెడ్డి,
వసంతరావు రామకృష్ణరావు,
శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్, IAS గార్లు




లయన్సు క్లబ్‌లో సన్మానితులు
శ్రీరామకృష్ణరావు,
వేదికపై
శ్రీ డి.సి.హెచ్. తిరుపతిరాజుగారు.



శ్రీ రామకృష్ణరావు.
జన్మదిన సందర్భముగా దంపతులను
సత్కరిస్తున్న
డా॥ కె.ఎస్. శాస్త్రిగారు



55820

శ్రీ పి.ఎ.పి. దత్తు శ్రీ రామకృష్ణారావు
దంపతులను సన్మానిస్తున్న దృశ్యం
తేది 27.[illegible].2001





శ్రీ నారాయణగురు విగ్రహము వద్ద జ్యోతి ప్రజ్వలన చేస్తున్న శ్రీరామకృష్ణరావు - శ్రీ నారాయణగురు దర్శనవేది అధ్యక్షులు శ్రీ ఎమ్.కె. లక్ష్మణ్ ప్రక్కన ఉన్నారు.



శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీగారు (గుంటూరు) శ్రీ రామకృష్ణరావు దంపతులను దీవించుచున్న దృశ్యం (2-4-2001)



శ్రీరామకృష్ణరావు 76వ జన్మదిన సందర్భముగా ఆ దంపతులను సత్కరిస్తున్న అవధాన సరస్వతి శ్రీ పేరాల భరతశర్మగారు, శ్రీదత్తు మరియు కళాప్రపూర్ణ శ్రీ గణపతిరాజు అచ్యుతరామరాజుగార్లు చిత్రంలో ఉన్నారు. (27-2-2001) శ్రీకృష్ణాశ్రమం విశాఖ సారస్వతవేదిక అభినందన సభలో



శ్రీరామకృష్ణరావును విశాఖ షిప్‌యార్డు రచయితల సంఘం తరఫున హిందుస్థాన్ షిప్‌యార్డు మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ బింద్రాగారు సత్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో శ్రీ వి. బంగార్రాజుగారు తేది 5-8-1990.

# శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయము



## (ఉపమాక - ఆంధ్రప్రదేశ్)

''కలౌ వేంకటనాయకః'' అని నానుడి. వాస్తవమునకు శ్రీ వేంకటేశ్వరస్వామి వారి చరిత్ర అతి పురాతనమైనది. విదేశీయులకు సైతము, భక్తి కుదిరి, శ్రీ స్వామివారికి మ్రొక్కుకొని, తమకు కలిగిన ఆపద నుండి విముక్తులైన సంఘటనవములు కలవు. అట్టి ఉదంతమును, నేను నా ''విశాఖపట్టు దేవాలయములు'' అను గ్రంథము నందు వివరించితిని. (పేజి 130)

మనరాష్ట్రములో గల, పల్లెలందున, పట్టణ ప్రాంతములందున శ్రీ వేంకటేశ్వర దేవాలయములు కలవు. అట్టివానిలో ఉపమాకలో గల శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఆలయము ఒకటి.

భక్తులు, ఆస్తికులు సందర్శించు ఈ దేవాలయమునకు గల ప్రశ యేమనగా, ఏడాదికి ఒకసారి, ఏకాదశి తిథినాడు జరుగుచున్న ''కళ్యా ఉత్సవము'' ఈ ఉత్సవములో భాగముగా జరుగు ''కన్యా వరణ సంవాదము' అను కార్యక్రమమును, కనులారా చూచి ఆనందించి, తమ భక్తి ప్రపత్తులన వెల్లడించు భక్తులతో ఆలయ ప్రాంగణము శోభాయమానమై ఉండును.

శ్రీ స్వామివారి కళ్యాణమునకు ముదు జరుగు రసవత్తర ఘట్టము భక్తులను, ఎంతగానో ఆకట్టుకొనుచున్నది. పెండ్లికి, ఎదురు సన్నాహముల్ శ్రీ స్వామివారిని ఇత్తడితో చేయబడిన గరుడ వాహనముపైన రాజాధిరా వాహనముపై శ్రీ అమ్మవారిని, చక్కగా అలంకరించి ఎదురెదురుగా ఉంచుదురు

తరువాత స్వామి వారిని రథముపై ఊరేగించెదరు. విశేషమేమనగా ఇచట వెంకన్నస్వామి, అలివేలు మంగల పెళ్లి చూపులు, పెళ్లి మాటలు జరుగుతాయి దీనినే కన్యావరణసంవాదమని అందురు. నక్కపల్లి మండలంలో గల ఈ దేవాలయమును సందర్శించు వారి పాపములు తొలగిపోవునని భక్తుల విశ్వాసము ప్రతి సంవత్సరము ఫాల్గుణ శుద్ధ ఏకాదశినాడు, కళ్యాణ ఉత్సవము జరుగుచున్నది. ఈ వేంకటేశ్వరునిపై రచింపబడిన శతకము ఒకటి ప్రచారముల్ నున్నది.

# శ్రీ ముఖలింగేశ్వర దేవాలయము

## (శ్రీకాకుళం - ఆంధ్రప్రదేశ్)

ఆంధ్రలో, వైష్ణవాలయములే కాక, శైవాలయములు కూడా ప్రాచుర్యములోనున్నవి. దక్షారామం, శ్రీకాళహస్తి, శ్రీశైలము వంటి ప్రసిద్ధ దేవాలయములతోపాటుగా, ప్రశస్తి పొందిన వానిలో శ్రీ ముఖలింగేశ్వర దేవాలయము ఒకటి.

శ్రీకాకుళం జిల్లాకు చెందిన, జలుమూరు మండలములో గల, శ్రీ ముఖలింగ క్షేత్రము, దక్షిణకాశిగా, ప్రశస్తి పొందినది. ఇది పర్యాటక కేంద్రముగా కూడా, ప్రాచుర్యము పొందుచున్నది.

జిల్లా కేంద్రమునకు, సుమారు 50 కి॥ మీ॥ దూరములో గల, ఈ ఆలయము ఆహ్లాదకరమైన వంశధారనదీతీరమునందున్నది. త్రికోణము ఆకృతిలో, సోమేశ్వర, భీమేశ్వర, మధుకేశ్వర ఆలయములు కలవు. వీనిలో మధుకేశ్వర ఆలయము (శ్రీ ముఖలింగేశ్వర ఆలయము), తక్కిన వాని కంటెను పెద్దది. ఒరిస్సా ప్రజలు శ్రీ మధుకేశ్వరాలయమును, శ్రీ ముఖలింగముగా వ్యవహరించుచున్నారు. చాలామంది, ఈ ముఖలింగేశ్వర స్వామిని దర్శించి పూజాదికములు జరిపించుచున్నారు.

పరమేశ్వరుని ముఖము, లింగమునందు కనిపించుట వలన శ్రీ ముఖలింగము అనుపేరు రూఢియైనట్లు తెలియుచున్నది.

ఇది ఆంధ్రలోని, పుణ్యక్షేత్రములలో పురాతనమైనది, మరియు విశిష్టత కలిగినది. భక్తులు, భాగవతులు కాశీనగరములో విశ్వేశ్వర స్వామిని దర్శించుటకు ముందుగా గంగానదిలో స్నానము చేయుదురు. అయితే, చాలామంది భక్తుల అభిప్రాయమేమనగా, గంగలో స్నానము, కాశిలో లింగ సందర్శనము, శ్రీశైలములో శిఖరదర్శనము చేసికొని, చివరిగా శ్రీ ముఖలింగ దర్శనము చేసిన ముక్తి కలుగును. శివాలయములలో ప్రధానముగా పూజింపబడేది లింగము - విగ్రహములు సాధారణముగా ఉండవు - కాని, ఇచట ఈ ఆలయములో లింగాకృతిలోనే శివుని ముఖము దర్శనీయమగుచున్నది!

చారిత్రికముగా, 14వ శతాబ్దిలో, పర్లాకిమిడికి (ఒరిస్సా రాష్ట్రము)